శ్రీ:

# కైశిక మాహాత్మ్యము

(వరాహ పురాణాంతర్గతము)

పరాశర భట్టరువారి వ్యాఖ్యాన సహితము

సాహిత్య శిరోమణి,

స్థానీకం, పార్థసారథి అయ్యంగార్

(శ్రీరంగం దేవస్థానం లైబ్రేరియన్)

పూర్వపీఠిక, ఉత్సవనిరూపణము, టిప్పణము, అనుబంధములతో
ప్రకాశించినది

ఈశ్వర, తుల    1937    0—8—0

# ఉపకారకులు

1. విద్వాన్, తిరువాళి, శ్రీరంగాచార్ స్వామి—తిరుమళిశ

2. మదరాస్ "హిందూ" అండు కంపెని వారు—
   - వి. తిరువేంగడత్తాన్ శెట్టిగారు,
   - సి. టి. ఆళ్వారు శెట్టిగారు,

3. యెర్రబల్లి వెంకటేశ్వరరావుగారు, జమీన్‌దారు, కల్లెడ, నైజాం

4. మీ. కో. రామానుజదాసులువారు, శ్రీరంగం

శ్రీః

# కైశిక మాహాత్మ్యము

## విషయసూచిక

ఇతర అనుబంధములు రెండవ భాగమున ముద్రింపబడును.

శ్రీః

# I. కైశిక మాహాత్మ్య పూర్వ పీఠిక

**1. కైశిక పురాణమా ? మాహాత్మ్యమా ?—**

మాహాత్మ్యమనియే పేరు. ఈ గ్రంథము కైశికముయొక్క మాహాత్మ్యమునే చెప్పుచున్నది. కైశిక పురాణమను పేరు తగదు. ఇది పురాణమం దుండుటచే పురాణమని వ్యవహరింపబడుచున్నది. "ఏతద్గీతఫల" మను శ్లోక వ్యాఖ్యలో భట్టరువారుకూడ ఈ గ్రంథమును మాహాత్మ్యమనియే చెప్పుచున్నారు. కాని, గొప్ప పండితులు కవీశ్వరులుకూడ కైశిక పురాణమనియే తమ గ్రంథములలో ప్రయోగించియున్నారు. శ్రీరంగరాజ చరిత భాణమందు "శ్రోతుం పురాణంమయి కైశికాంకం"— అని చెప్పబడియున్నది. కైశికపురాణమను పేరునుబట్టి ఇది ఏదో ఒక ఉపపురాణమో అని భ్రమించవలదు. ఇది పురాణమం దొకే అధ్యాయముగనుండు మాహాత్మ్యము.

**2. ఈ మాహాత్మ్యము ఏ పురాణమం దున్నది ?—**

ఇది వరాహపురాణాంతర్గతము. అందు 48–వ అధ్యాయమని భట్టరువారి వ్యాఖ్యానముతోనుండు తాళపత్రకోశములలోను అచ్చుపుస్తకములలోను ఆఖరున కానబడుచున్నది. వరాహపురాణము బెంగాల్ ఏష్యాటిక్ సొసైటియందును బొంబాయి వెంకటేశ్వర్ ప్రస్సులోను ముద్రింపబడి యున్నది. దక్షిణదేశమందు 48–వ అధ్యాయముగ నుండు కైశిక మాహాత్మ్యము బొంబాయి కలకత్తా పుస్తకములలో 139–వ అధ్యాయముగ నున్నది. 48–వదగు కైశికమాహాత్మ్యము 139–వ అధ్యాయముగ నగునట్లు మధ్యన అనేకాధ్యాయములు కలిసినట్లు తెలియుచున్నది. 1893–వ సంవత్సరములో బెంగాల్ ఏష్యాటిక్ సొసైటికి గాను వరాహపురాణమును ముద్రించిన హృషీకేశ శాస్త్రి

త్రిః సప్తషట్ క్షితిమితే నృపవిక్రమస్య
కాలే గతే భగవతో హరిబోధనస్య।
వీరేశ్వరేణ సహ మాధవభట్టనామ్నా
కాశ్యాం వరాహకథితం లిఖితం పురాణం॥

అను శ్లోకమును బట్టి, కాశిలో 1621-వ శకమున మాధవ భట్టుడున్ను వీరేశ్వరుడున్ను కలిసి వరాహపురాణము నిప్పటి రీతిలో వ్రాసినట్లు ఊహించుచున్నారు. దక్షిణమున భట్టరు వారి వ్యాఖ్యతో నుండు కైశిక మాహాత్మ్యమునకున్ను బొంబాయి కలకత్తా పుస్తకముల 139-వ అధ్యాయమునకున్ను చాల భేదమున్నది. ఆ 139-వ అధ్యాయమునకు "సౌకరవక్షేత్ర మాహాత్మ్యము"— అని పేరే గాని, కైశికమాహాత్మ్యమని పేరు లేదు. సౌకరవక్షేత్రమనునది కైశిక మాహాత్మ్యపు ఇతిహాసము జరిగిన తిరుక్కురుంగుడి క్షేత్రమే. కాని, ఆ సౌకరక్షేత్ర మాహాత్మ్యమునందు కైశికమను మాట కూడ లేదు. సౌకరక్షేత్ర మాహాత్మ్యమందుండు కథమాత్రము కైశిక మాహాత్మ్యమందుండు చండాల బ్రహ్మరక్షస్ సంవాదమునకు సరిగనే ఉన్నది. సౌకరక్షేత్ర మాహాత్మ్యము కూడ ఇందు నాఖరున చేర్పబడియున్నది. దక్షిణమున భట్టరువా రాదరించిన కైశిక మాహాత్మ్యమునకున్ను ఉత్తర దేశపు సౌకరవక్షేత్ర మాహాత్మ్యమునకున్ను ఉండు వ్యత్యాసములను గమనింపుడు.

మదరాస్ సర్కారువారు సేకరించియుండు వ్రాత పుస్తకములలో 2060 మొదలు-62 నెంబరుగల వరాహపురాణ పుస్తకములు 3 ఉన్నవి. నీటిలో ఆఖరి రెండున్ను అపూర్ణములు. మొదటిదిమాత్రము పూర్ణముగనున్నది. ఇందు సౌకరక్షేత్ర మాహాత్మ్యము 155-వ అధ్యాయముగ నున్నది. ఈ అధ్యాయము ఉత్తర దేశపు పుస్తకము ననుసరించి యున్నదేగాని, దక్షిణమందుండు కైశిక మాహాత్మ్యము ననుసరించియుండలేదు. మదరాస్ సర్కారువారి వరాహ పురాణపు 155-వ అధ్యాయము ఆఖరున చేర్పబడి, ఉత్తర దేశ వరాహ పురాణపు 139-వ అధ్యాయములోగల పాఠభేదములు క్రింద నియ్యబడియున్నవి.

3. కైశిక మాహాత్మ్యమనగా ఏమి అర్థము ?—

సంగీతమందు కైశికమను నొక రాగము గలదు. ఆ రాగము యొక్క మాహాత్మ్యమునీ గ్రంథము చెప్పుచున్నది. కైశికమను పదముయొక్క స్వరూపము తెలియక "కౌశికపురాణము, కౌశిక మాహాత్మ్యము. కౌశిక యేకాదశి" అని అనేకులు చెప్పుదురు. కైశిక రాగముయొక్క మాహాత్మ్యమును చెప్పు నీ అధ్యాయము సంగీత గ్రంథము కాదు. ఇది కైశిక రాగమున పాడినవాని వృత్తాంతము, ఫలము—మున్నగువానిని చెప్పుచున్నది. కైశిక శబ్దార్థము నాఖరున నుండు నిరుక్తిలో చూడుడు.

4. కైశికయేకాదశి అనగా ఏమి అర్థము ?—

అరవ పంచాంగములలో కార్తిక శుద్ధ ఏకాదశినాడు కైశిక ఏకాదశి అని కనబడుచున్నది. ఈ ఏకాదశికిన్ని కైశిక స్వరమునకున్ను ఏమి సంబంధము అనగా—

1. కైశిక స్వరములో పాడవలసిన యేకాదశి కైశిక యేకాదశి.

2. కైశిక స్వరములో ఒక చండాలుడు పాడిన ఏకాదశి కైశిక యేకాదశి.

3. కైశికగానముచేత నొక బ్రహ్మరక్షస్సునకు శాపము పోయి బ్రాహ్మణ్యము కలిగిన యేకాదశి కైశిక యేకాదశి.

4. కైశిక మాహాత్మ్యమను నీ అధ్యాయమును పఠించవలసిన యేకాదశి కైశిక యేకాదశి.

అని ఇట్లు నాలుగు విధములుగా కైశికసంబంధము సూచింపవచ్చును.

1. నాడు కైశికగానము చేయవలెనని భగవదాజ్ఞ

> యస్తు గాయతి భక్త్యా వై కైశికం మమ సంసది।
> స తారయతి దుర్గాణి శ్వపాకో రాక్షసం యథా॥

అను నీ కైశిక మాహాత్మ్యములోనే కనబడుచున్నది.

2-3. నామ చండాలుడు కైశిక గానము చేసినది, ఆగానము చేత బ్రహ్మరాక్షసునికి మోక్షమును కలిగించినది కూడ

యత్త్వయా పశ్చిమం గీతం స్వరం కైశిక ముత్తమం।
ఫలేన తస్య విప్రం తే మోక్షయిష్యామి కిల్బిషాత్

అని ఈ మాహాత్మ్యములోనే ఉన్నది.

4. కైశిక మాహాత్మ్యమను నీ అధ్యాయమును నానుపఠించ వలెనను విధి ఈ మాహాత్మ్యములోనే

ఏతద్గీతఫలం కైశికాఖ్యం ద్వాదశీషు ప్రియః
యస్తు గాయతి నః శ్రీమాన్ మమ లోకం స గచ్ఛతి

అను శ్లోకమునుండి తెలియుచున్నది.

5. కైశిక సంబంధము యేకాదశికా ద్వాదశికా ?—

పై నుదహరించిన "ఏతద్గీత ఫల" మను శ్లోకమునుండి కైశిక మాహాత్మ్యమును పఠించవలసినది ద్వాదశినాడే అని తెలియుచున్నది.

చండాలుడు భగవంతుని యెదుట గానముచేసినదియు ద్వాదశి నాడే అని

కౌముదస్య తు మాసస్య ద్వాదశ్యాం శుక్లపక్షకే
సుప్తేఽనే గతే యామే వీణామాదాయ నిర్యయౌ

అను శ్లోకమునుండి వ్యక్తమగుచున్నది. కావున, కైశిక సంబంధము ద్వాదశి కేగాని ఏకాదశికి లేదు. కాని, ద్వాదశినాడు చేయ వలసిన కైశికగాన, కైశిక మాహాత్మ్య పఠనములకున్ను పూర్వాం గములైన ఉపవాస జాగరణాదులు ఏకాదశినాడే చేయవలయును గావున కైశిక ఏకాదశి అందురు. ఇచ్చట ద్వాదశి అనగా ద్వాదశి ఉదయమందే అని అర్థము. ద్వాదశి ఉదయములో కావలసిన కార్యము ఏకాదశిరాత్రిలో ప్రారంభమగుచున్నందున యేకాదశికూడ కైశిక శబ్దముతో వ్యవహరింపబడు చున్నది.—

6. కైశిక మాహాత్మ్యముయొక్క కథా సంగ్రహము—

దక్షిణ దేశమందలి తిరునెల్వేలి జిల్లాలో మహేంద్ర పర్వత

మునకు సమీపముగ సిద్ధాశ్రమమను నొక క్షేత్రముగలదు. దీనికి "తిరుక్కురుంగుడి" అని పేరు. వైష్ణవ దివ్యదేశములు 108 లో ఇది ఒకటి.

పూర్వ మీ ఊరిలోనుండిన చండాలు డొకడు కార్తికశుద్ధ ఏకాదశి వ్రతమునాటిరాత్రి నిద్రలేక యుండి భగవంతునిగూర్చి గానము చేయుటకుగాను గుడికి పోవుచుండెను. మార్గములో ఆకలిచే బాధింపబడుచున్న బ్రహ్మరక్షస్సొకటి ఆ చండాలుని మ్రింగవచ్చినది. భాగవతోత్తముడైన ఆ చండాలుడు శరీరమందు ఆశలేనివాడై నప్పటికీ, భగవంతునిగానముచేత స్తుతించకనే ప్రాణమును విడవలసివచ్చిన దానికి దుఃఖించి, భగవత్సన్నిధిలో గానముచేసి వచ్చువరకు అవకాశ మియ్యవలెనని బ్రహ్మరక్షస్సును ప్రార్థించెను. చండాలుడు మరల వచ్చునని బ్రహ్మరక్షస్సుకు నమ్మకము లేదు. "నేను మరలరాని యెడల పరదారగమన దోషము నొందుదును; పంక్తివంచన చేసిన దోషము నొందుదును"—అని చండాలుడు పలు దోషములను చెప్పి, ఆఖరులో

వాసుదేవం పరిత్యజ్య యోన్యం దేవముపాసతే।
తేషాం గతిం ప్రపద్యే వై యద్యహం నాగమే పునః॥
నారాయణ మథాన్యైస్తు దేవైస్తుల్యం కరోతి యః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥

"నేను మరల రానియెడల వాసుదేవుని త్యజించి ఇతర దేవతలను ఉపాసించువారి దోషము నొందుదును; నారాయణుని ఇతర దేవతలకు సమముగ భావించు వారి దోషమునొందుదును"—అని ప్రతిజ్ఞ చేసెను. చండాలున కుండు దేవతాంతర ఉపాసనయు దేవతాంతర సామ్యబుద్ధియు లేని శుద్ధవైష్ణవత్వమును చూచి బ్రహ్మరక్షస్సుకు నమ్మకము కలిగినది. బ్రహ్మరక్షస్సు చండాలుని విడిచినది. చండాలుడు భగవత్సన్నిధికేగి గానముజేసి, ప్రతిజ్ఞ చేసిన ప్రకారమే బ్రహ్మరక్షస్సుకడకు వచ్చెను. బ్రహ్మరక్షస్సు చండాలుని చూచి—"నీవు బ్రతుక తలచినచో నీ గాన ఫలమును నాకిమ్ము."—అనినది. ఆ

చండాలుడు సమ్మతింప లేదు. గీతఫలమంతయు నియ్యకపోయినను సగమునైన నియ్యవలెనని అడిగినది బ్రహ్మరక్షస్సు. ఒక జామములో పాడిన గీతముయొక్క ఫలమునైన నియ్యవలెనని అడిగినప్పటికిన్ని, చండాలుడు శరీరమును త్యజించుటకు సిద్ధముగనుండెనే గాని, గీత ఫలమునిచ్చుటకు మాత్రము సమ్మతించలేదు.

బ్రహ్మరక్షస్సు—ఒక గీతముయొక్క ఫలమునైన ఇచ్చి నన్ని యవస్థనుండి రక్షింపుము.

చండాలుడు—నీకు ఈ జన్మము లభించుటకు నీవు చేసిన దోషమేమి ?

బ్రహ్మరక్షస్సు—నేను పూర్వము చరకగోత్రములో పుట్టిన వాడను. సోమశర్మ అను బ్రాహ్మణుడను. సూత్రమంత్రములను పరిపాలించక భ్రష్టుడనై యాగము ప్రారంభించితిని. అనర్హుడనై యాగము ప్రారంభించుటచే నాకు కడుపులో శూలవ్యాధి కలిగి, నేను యాగము ప్రారంభమయిన ఐదవరోజున మరణించితిని. యాగము పూర్తికాకముందే నేను మరణించి, యాగము అపూర్ణమగుటచే నాకీ జన్మ లభించినది.

చండాలుడు—

యన్మయా పశ్చిమం గీతం స్వరం కైశికముత్తమం ।
ఫలేన తస్య భద్రం తే మోక్షయిష్యామి కిల్బిషాత్ ॥

నేను ఆఖరులో చేసిన కైశిక గానముయొక్క ఫలముచేత నీ దోషమును తొలగించెదను—అనెను.

వెంటనే బ్రహ్మరక్షస్సు శాపవిముక్తుడై బ్రాహ్మణుడయ్యెను.

## 7. కైశికమాహాత్మ్య సారము—

భగవంతునకు ప్రీతికలుగజేయు నుపాయము లన్నిటిలోను గానము మిక్కిలి శ్రేష్ఠముగను, సుకరముగ నుండుననుటయే ఇందలి సారము. దీని నొక ఇతిహాసమూలముగ నీ మాహాత్మ్యము బోధించు చున్నది.

8. కైశిక మాహాత్మ్య శ్రైష్ఠ్యము—

కైశిక గానము చేయవలెననియు, కైశిక మాహాత్మ్యమును పఠించవలెననియు రెండు కార్యములను భగవంతు డీ మాహాత్మ్యమందు విధించుచున్నాడు. కైశిక గానమునకు కాల నియమము లేక "కైశికం మమ సంసది" అని దేశ నియమమును మాత్రమే చెప్పినందున, కైశికగానము నెప్పుడైన భగవత్ సన్నిధియందే చేయవలెనని యేర్పడినది. కైశిక మాహాత్మ్య పఠనమునకు దేశ నియమము లేక "కౌముదద్వాదశీం పునః"—అని యెక్కడనైనను కార్తిక శుక్ల ద్వాదశియందే మాహాత్మ్యమును పఠించవలెనని యేర్పడినది. ఈ రెండు విధులకున్ను ఫలముకూడ భిన్నముగనున్నది. కైశిక గానముచేయువానికి "సతారయతి దుర్గాణి"—ఆపదలనుండి ఉద్ధరింపగలడు—అని ఇంతియే ఫలము. కైశిక మాహాత్మ్యమును పఠించువాడు "మమ లోకంచ గచ్ఛతి" నా లోకమును పొందును—అని చెప్పబడి యున్నది. ఆపదలనుండి ఉద్ధరింపజేయు కైశికగానమునకన్న భగవల్లోక ప్రాపకమైన కైశిక మాహాత్మ్య పఠనమే విశేషము. ఇంతియేగాక, కైశికరాగమున పాడుట సంగీతనైపుణ్యముగల వారికే సాధ్యము. కైశిక మాహాత్మ్యము పఠించుట నందరికే సుకరము. కావున, భగవల్లోక ప్రాప్తికొరకై కైశిక ద్వాదశినాడు కైశిక మాహాత్మ్యము పఠించు లఘుతమమైన ఉపాయమును బోధించుటయే ఈ మాహాత్మ్యమునకుగల శ్రైష్ఠ్యమగును.

9. భట్టరువారున్ను కైశిక మాహాత్మ్యమున్ను—

ఈ మాహాత్మ్యముయొక్క శ్రైష్ఠ్యము నెరిగినవారు కూరత్తాళ్వార్ కుమారులైన పరాశరభట్టరు వారొకరే. భట్టరువారికి పూర్వీకులైన ఋషులు, ఆళ్వారులు, ఆచార్యులు అందరున్ను కైశిక మాహాత్మ్యముయొక్క మర్మము నెరుగరని తోచుచున్నది. వారిలో ఒకరుకూడ తమ గ్రంథములలో నీ మాహాత్మ్యమును ప్రస్తావించనేలేరు. తిరుక్కురుంగుడిని మంగళాశాసనముచేసిన ఆళ్వార్లలో ఒకరుకూడ అచ్చట జరిగిన కైశిక వృత్తాంతమును తమ పాశురములలో

ప్రతిపాదించలేరు. ఒకే అధ్యాయముగ నుండు నీ కైశికమాహాత్మ్యమను నీ ఒక రత్నమును పురాణసముద్రములో మునిగి వెతికి యెత్తిన వారు భట్టరువారొకరే.

తమకు లభించిన కైశిక మాహాత్మ్యమునకు అరవములో అత్యాశ్చర్యముగ అవతారిక వ్యాఖ్యానములు వ్రాసి, దీనిని భట్టరువారు రక్షించిరి. భట్టరువారి అవతారికలో మహా రహస్యమైన శాస్త్ర విషయములు సంప్రదాయ విషయములున్ను వెల్లడి యగుచున్నవి. భట్టరువారి అవతారిక విషయ సంగ్రహ మీ ప్రకారము :

1. పురాణములే వేదోపబృంహణములలో ఇతిహాసముల కన్న స్వతంత్ర ప్రమాణములు కావున ఉత్కృష్టములు;—

2. అవతారములలో వరాహావతారమే జ్ఞాన స్వరూపము, సమ్యక్ జ్ఞానోపకారకము, కృపాతిశయము గలది, రక్షకత్వ పూర్తి గలది, ఉత్తారకమైన రక్షకత్వము గలది, వాత్సల్యావినా భూతమైన పితృత్వముగలది అని ఆళ్వార్ల మతము;—

3. ప్రళయార్ణవ మగ్నయైన భూమి దేవినందుండి ఉద్ధరించి ఆమె శోకమును తీర్చినప్పటికి, సంసారార్ణవ మగ్నులైన తన ప్రజల దుఃఖనివృత్తి కొరకు సుకరోపాయము తోచక విషణ్ణయైయుండు నామె నాశ్వాసించుటకుగాను అవతరించినది కావున, వరాహపురాణమే భగవద్వాక్యము లన్నిటిలోను శ్రేష్ఠము ;—

4. గాన మొకటే భగవత్ప్రాప్తికి సుకరమైన ఉపాయమని భగవంతుడే ఈ కైశిక మాహాత్మ్యము ద్వారా భూమి దేవికి ఉపదేశించెను; ఆ భూమిదేవియే ఆండాళుగా అవతరించి గానముచేతనే భగవంతుని పొందినది;—అని నాల్గు రహస్యములు అవతారికలో భట్టరువారిచే వెల్లడియైనవి. ఇట్లు అవతారికలో నిర్వాహముచేసి, మాహాత్మ్యమునకుకూడ ప్రతిశ్లోక వ్యాఖ్యానము అనుగ్రహించినారు. ఆ గ్రంథమంతయు నిందులో చేర్పబడియున్నది. అవతారిక వ్యాఖ్యానములలోనుండు విశేషార్థములు ఆయా స్థలముల లోనే ప్రదర్శింపబడును.

భట్టరువారు మాహాత్మ్యమునకు అవతారిక వ్యాఖ్యానములు వ్రాయు పండిత కృత్యముతో విరమించలేదు.

ఈ మాహాత్మ్యమును కార్తికశుద్ధ ద్వాదశినాడు పఠించవలె నను భగవదాజ్ఞలో విశ్వాసము కలిగి, అటులనే భట్టరువారు ఆచరించిరి. భగవదాజ్ఞాప్రకారముగ భట్టరువారీ మాహాత్మ్యమును మాత్రం ఏదో ఒకచోటులో నుండి పఠించక, "పన్నిరునామం తేశుడైయ దేవర్ తిరువరంగచ్చెల్వనార్"—అని వరాహావతారము చేసిన పెరుమాళ్ అని ఆండాళ్ చేత శ్లాఘింపబడిన నంబెరుమాళ్లకే తన అవతారిక వ్యాఖ్యానముల సహితముగ పఠించిరి. నంబెరుమాళ్ మిక్కిలి సంతోషించి తాము వరాహపురాణములో కైశిక మాహాత్మ్య పఠనమున కిచ్చిన వరప్రకారముగ నాడే భట్టరువారిని లీలావిభూతి నుండి నిత్యవిభూతికి చేర్చుకొనిరి.

వరాహస్వామి భూమిదేవికి ఉపదేశించిన సుకరోపాయమగు గానమునే అనుష్ఠించిన ఆండాళుకు భగవంతుడు లభించెనని రహస్యము నెరిగిన భట్టరువారు ఆండాళ్ గానము ననుష్ఠించిన ప్రకారమే ఈ మాహాత్మ్య పఠనము ననుష్ఠించిరి. ఆండాళ్ గానమునే ఉపాయముగ స్వీకరించినది; భట్టరువారీ మాహాత్మ్యమునే ఉపాయముగ స్వీకరించిరి. ఆండాళుకు గానముచేత భగవల్లాభము; భట్టరువారికి మాహాత్మ్య పఠనముచేత పరమపద లాభము. ఆండాళు కుపకరించినది భగవద్విషయమైన గానము; భట్టరువారికి ఉపకరించినది భాగవతోత్తముడైన నంపాడువాన్ విషయమైన కైశికమాహాత్మ్యము.

కావున మాహాత్మ్యమునకు భట్టరువారే వ్యాఖ్యాతులు, అనుష్ఠాతులు, ప్రవర్తకులుగా నగుదురు, ఉత్థాన ద్వాదశి యగు కార్తిక శుద్ధ ద్వాదశి ఉదయము చాతుర్మాస్య యోగనిద్రనుండి మేలుకొనే భగవంతునికి ముఖోల్లాసముగ పుణ్యకథలను పఠించి, గీతనృత్యములు చేసి ఉత్థానోత్సవము జరుపవలెనని ఆగమశాస్త్రవిధి యున్నది. ఆ ప్రకారము నాడు పఠించవలసిన పుణ్యకథా స్థానములో నాడే

జరిగినదై, నాడే భగవదాజ్ఞాప్రకారముగ విహితమై, అవశ్యం పఠితవ్యమైన ఈ కైశిక మాహాత్మ్యమును భట్టరువారు అవతారిక వ్యాఖ్యానములతో భగవత్సన్నిధిలో పఠించి ప్రవర్తింపించిన ప్రకారమే శ్రీరంగములోను, ఈ మాహాత్మ్యపు ఇతిహాసము జరిగిన తిరుక్కురుంగడిలోను సకల విష్ణు సన్నిధులలోను ఇది ప్రతిసంవత్సరం పఠింపబడుచున్నది. భట్టరువారిచే అనుగ్రహింపబడినదై, అనుష్ఠింపబడినదై, ప్రవర్తింపబడినదైన ఈ మాహాత్మ్యము సకల వైష్ణవులకున్ను అత్యంతం ఉపాదేయమగును.

10. వరాహపురాణమున్ను, వేదాంతదేశికులున్ను—

భట్టరువారు వరాహావతార శైత్ర్యమును స్థాపించి కైశిక మాహాత్మ్యముయొక్క సారమును వెల్లడిజేసినట్లు వేదాంతదేశికులు వరాహ చరమశ్లోక సారాంశమును వెల్లడిజేసిరి. దేశికులవారి రహస్య గ్రంథములలో 'రహస్య శిఖామణి' అనునది వరాహ చరమశ్లోక విషయమై యవతరించినది. వరాహ చరమశ్లోకమునకు వ్యాఖ్యానము ననుగ్రహించు వ్యాజముగ వేదాంతదేశికులు వారు వరాహావతార శైత్ర్యమును భట్టరువారు ప్రదర్శించిన మార్గమునే అనుసరించి, అవతారికలో దానిని మిక్కిలి రసవంత్తముగ విశేషపరచి స్థాపించియున్నారు. కైశిక మాహాత్మ్యమును భట్టరువారి అవతారికతో అనుభవించునప్పుడు ఆ అవతారికలో నుండు విశేషములను వెల్లడిజేయునట్లు వేదాంతదేశికులు అనుగ్రహించిన వరాహచరమశ్లోక వ్యాఖ్యానావతారికనుకూడ అనుభవించవలసినది ఆవశ్యకము. కావున, దేశిక శ్రీసూక్తికూడ ఇందులో చేర్పబడియున్నది. అందులో గల విశేషార్థములు అచ్చటనే ప్రదర్శింపబడును.

11. భట్టరువారి గ్రంథములు—

1. శ్రీరంగరాజ స్తవము.
2. శ్రీగుణరత్న కోశము.
3. శ్రీరంగనాథాష్టకము.
4. సహస్రనామ భాష్యము.
5. తిరునెడుంతాండక వ్యాఖ్యానము.
6. కైశికమాహాత్మ్య వ్యాఖ్యానము.

7. రంగనాథ తిరుమంజన శ్లోకములు. 8. లక్ష్మీకల్యాణము.
9. అష్టశ్లోకీ. 10. కొన్ని ముక్తములు.

ఇందు లక్ష్మీకల్యాణ మనునది వేదాంత దేశికులవారిచే రహస్యత్రయ సారమం దుదహరింపబడిన శ్లోకమూలముననే తెలియుచున్నది. ఈ గ్రంథ మిదివరకు బయట రానందున ఇప్పటి వారెవరికిన్ని తెలియదు.

నంబెరుమాళ్ల కెదుట అధ్యాపకులచే శ్రీ రంగరాజ స్తవము, శ్రీ గుణరత్న కోశము—ఈ రెండున్ను సేవింపబడుచున్నది. తిరుమంజన శ్లోకములున్ను కైశిక మాహాత్మ్యమున్ను భట్టరువారి వంశ్యులచే పెరుమాళ్ల కెదుట సేవింపబడుచున్నవి. తిరుమంజన శ్లోకములకు భట్టరువారే స్వయముగ వ్యాఖ్యానము సాయించి యున్నారు. అవి వ్యాఖ్యాన సహితముగనే పెరుమాళ్లకు సేవింపబడుచున్నవి. ఈ శ్లోకములలో "త్వాం మేహాం మే" అను శ్లోకము మాత్రమే లోకులకు తెలియును; ఆ శ్లోకపు వ్యాఖ్యానముకూడ తెలియదు. తతిమ్మ శ్లోకములున్ను వ్యాఖ్యానములున్ను భట్టరువారి తిరుమాళిగలోను, వారి సంతతివారి వాక్కులో నున్నవి. తిరుమంజన శ్లోకములు నంబెరుమాళ్ల తిరుమంజన సమయము దప్ప ఇతర సందర్భములలో ఎవరున్ను వినజాలరు.

కైశిక మాహాత్మ్యము మాత్రం బయట వచ్చినది. ఇది భగవదాజ్ఞాప్రకారముగ కార్తిక శుద్ధ ద్వాదశినా డందరిచే అన్ని సన్నిధులలోను పఠించునట్లు ఏర్పడినందున లోకోజ్జీవనార్థముగ వెల్లడియైనది కాబోలు!

12. కైశికమాహాత్మ్య పుస్తకములు—

ఇపుడు కైశిక మాహాత్మ్యమును చక్కగ పరిష్కరించి ఇంత విస్తారముగ అచ్చువేయు నీ ప్రయత్నములో ఆధారముగ నుండు పుస్తక మేదని తెలుపుచున్నాడను. కైశిక మాహాత్మ్యపు తాళపత్ర కోశము లనేకము లున్నవి. విష్ణు సన్నిధిగల ప్రతి ఊరిలోను

కైశిక మాహాత్మ్యము భట్టరువారి వ్యాఖ్యాన సహితమై యున్నది. మదరాస్ వ్రాతపుస్తకశాలలోను కొన్ని ప్రతులున్నవి. 66 సంవత్సరములకు పూర్వము అంగీరస నామసంవత్సరములో కుంభకోణమువారిచే కైశిక మాహాత్మ్యము భట్టరువారి వ్యాఖ్యతో ముద్రితమైనది. తిరునెల్వేలి మేల్‌వీడు రంగనాథపిళ్లచే 1905-వ సంవత్సరమున "శ్రీ జయంతి, కైశిక మాహాత్మ్యము" అని పేరుగల ఒక పుస్తకము ముద్రితమైనది. ఇందు-

1. శ్రీ జయంతి మాహాత్మ్యము, కృష్ణస్తుతి. 2. కైశిక ఏకాదశీమాహాత్మ్యము - ఈ రెండు గ్రంథములతో—

1. కైశిక రాగవృత్తాంతము.

2. తిరుక్కురుంగుడి పాశురములు.

3. తిరుమంగ ఆళ్వార్లు, ఉడయవర్లు, మణవాళమాముని, వీరు తిరుక్కురుంగుడిని మంగళాశాసనము చేసిన కాలము వివరమున్ను.

4. తిరుక్కురుంగుడి జియ్యర్ మఠ పరంపర.

5. వానమామల జియ్యర్ మఠ పరంపర.

6. తిరుక్కురుంగుడి గుడిలోనే యుండువారై "పక్కం నిన్ఱ శివనార్" అని ఆళ్వార్లచే చెప్పబడినవారైన శట్టనాథుని వృత్తాంతము,—ఇన్ని విషయములు గలవు.

ఇందుండు కైశిక మాహాత్మ్యము మూలగ్రంథములను గాని భట్టరువారి వ్యాఖ్యానమును గాని అనుసరించలేదు. చండాళ బ్రహ్మరక్షస్ సంవాదమునే యెవరో తమకు తోచిన రీతిలో వ్రాసినట్లు తెలియుచున్నది. శ్రీవైకుంఠము పెరియనంబి వకుళభూషణాచార్ స్వామి ఈ పుస్తకమును శోధించినట్లు తెలియుచున్నది. కైశిక మాహాత్మ్యము మూలగ్రంథమునున్ను భట్టరువారి వ్యాఖ్యానమునున్ను చేర్చుకొని యెవరో వ్రాసినదైనప్పటికి, అందులో కొన్ని రసవంతములైన విషయములు గలవు. అవిగూడ సంగ్రహముగ అనుబంధములో చేర్చబడును.

ఇట్లు కైశిక మాహాత్మ్య పుస్తకములు భట్టరు వారి వ్యాఖ్యా నముతో పలు ప్రతులుండుటచే నన్నిటిని చూచి, శోధించి, వెల్లడి చేయుట అవశ్యము కాదు; అసాధ్యము కూడ! పుస్తకములలో అక్షర లోపములు దప్ప పాఠభేదము విశేషముగ గలవు కావున, యే పుస్త కమును ఆధారముగ పెట్టుకున్నానని ఆఖరున చెప్పెదను.

శ్రీః

# II. కైశికోత్సవ నిరూపణము

1. శ్రీరంగ కైశికము—

రంగనాథుడు కైశికమాహాత్మ్యమును అవతారిక వ్యాఖ్యాన ములతో విని భట్టరువారికి పరమపదము ననుగ్రహించిన వైభవము ఇప్పటికిన్ని శ్రీరంగములో ననుకరింపబడుచున్నది. భట్టరువారి కొరకై జరుగునది ఉత్సవపు వైభవము మాత్రమే. ఇపుడు కైశికమని చెప్ప బడు నుత్థానోత్సవమునకు ఆగమ విధియే గలదు కావున, ఈ ఉత్స వము భట్టరువారి కాలమునకు పూర్వము నుండియే జరుగుచున్నది.

2. ఆగమ శాస్త్రము—

దేవాలయ విషయమైనది ఆగమ శాస్త్రము. అది వైష్ణవా గమము, శైవాగమము—అని రెండు విధము. వైష్ణవాగమము పాంచరాత్రము, వైఖానసము—అని రెండు. విష్ణ్వాలయములలో కొన్ని పాంచరాత్ర ప్రకారముగను, కొన్ని వైఖానసప్రకారము గను జరుగును.

3. శ్రీరంగమున కేర్పడిన ఆగమము—

శ్రీరంగము పాంచరాత్ర సన్నిధి. శ్రీపాంచరాత్ర సంహిత లలో రత్నత్రయమని ప్రసిద్ధమైన సాత్వత, పౌష్కర, జయాఖ్య—అను

మూడు సంహితలలో పౌష్కరముచేతను దాని వ్యాఖ్యయగు పార మేశ్వరము చేతను శ్రీరంగమందు కార్యములు జరుగుచున్నవి. ఈ రెండు సంహితలయందును లేక, అనుష్ఠానములోనుండు కార్యములకు సంహితాంతరములనుండియు, సంప్రదాయము నుండియు ఆధారము కనుగొనవలయును.

## 4. చాతుర్మాస్య యోగనిద్ర—

పౌష్కరములోను దాని వ్యాఖ్యానమగు పారమేశ్వరములోను చాతుర్మాస్య కార్యములు చెప్పబడి యున్నవి. చతుర్మాసమనగా— మిథున శుద్ధ ఏకాదశి నుండి తులా శుద్ధ ఏకాదశివరకుండు నాల్గు మాసములు. ఇది ఆలయమున కేర్పడిన చతుర్మాసము. ధర్మశాస్త్ర ప్రకారముగ పూర్ణిమనుండి పూర్ణిమాంతము చతుర్మాస లెక్క. చాంద్రమాన సౌరమాన భేదముచేత కటకమాస ప్రారంభమునుండి వృశ్చికమాసాంతమువరకు గూడ చతుర్మాస ముండును.

ఈ నాల్గు మాసములలో భగవంతుడు యోగనిద్ర చేయుచున్నాడు. మిథున శుద్ధ ఏకాదశిలో యోగనిద్ర ప్రారంభమగును. కావున, ఆ ఏకాదశికి శయనైకాదశి అని పేరు. సింహ శుద్ధ ఏకాదశిలో భగవంతుడు కుడిప్రక్కన త్రిప్పుకొనుటచే దానికి పరివర్తన ఏకాదశి అని పేరు. కార్తిక శుద్ధ ఏకాదశియందు భగవంతుడు మేలుకొనును. దానికి ఉత్థానైకాదశి, ప్రబోధైకాదశి, బోధనైకాదశి అని పేరు.

చతుర్మాసమనునది అందరికే ఏర్పడినది. సన్యాసులకు చాతుర్మాస్య నియమము నాల్గుపక్షములే గాని నాల్గుమాసములు లేదు.

శయనోత్సవము శ్రీరంగములో జరుగుటలేదు. ఇతర సన్నిధులలోను జరుగునట్లు తెలియలేదు. శ్రీరంగములో శయనోత్సవమని ప్రత్యేకముగ జరుగనప్పటికిని, వసంతోత్సవము పూర్తియయిన అనంతరం, ఏకాదశి అమావాస్య మొదలైన ఏకదినోత్సవమగు పర్వోత్సవముకూడ నిలుపబడుటయే శయనోత్సవమని ఊహింపవచ్చును. పరి

వర్తన ఏకాదశినాడే శ్రీరంగములో పవిత్రోత్సవము ప్రారంభమగు చున్నది. ఉత్థానైకాదశినాడు ఉత్థానోత్సవమ కైశికమును పేరున జరుగుచున్నది. పవిత్రోత్సవము కొన్ని సన్నిధులలో పరివర్తన ఏకాదశికి పిమ్మటకూడ జరుగును. ఉత్థానోత్సవము మాత్రం ఉత్థాన ద్వాదశిలోనే అన్ని సన్నిధులలోను జరుగుచున్నది. శివునికికూడ చాతుర్మాస్యశయనముగలదని తెలియుచున్నది. శివాలయములలో శయనోత్సవమున్ను ఉత్థానోత్సవమున్ను జరుగునట్లు తెలియలేదు.

5. పంచాంగములు—

ఉత్థాన ఏకాదశినాడు కైశిక ఏకాదశి అని అరవ పంచాంగములలో తప్ప ఇతర దేశ పంచాంగములలో వ్రాయబడలేదు. ఇతర పంచాంగములలో ఉత్థానైకాదశి, ప్రబోధైకాదశి, బోధనైకాదశి అనియే వ్రాయబడుచున్నది. క్షీరాబ్ధినాథపూజ, తులసీ వివాహము అని కూడ వ్రాయబడుచున్నది. అరవ పంచాంగములో క్షీరాబ్ధినాథ పూజ అని కూడ కనబడుచున్నది; తులసీ వివాహము వ్రాయ బడుటలేదు.

6. కైశికము ద్రావిడదేశ అనుష్ఠానము, వైష్ణవ విధి—

అరవ పంచాంగములలో మాత్రం కైశికమని వ్రాయబడు టచే ఇది ద్రావిడదేశ అనుష్ఠానమని తెలియుచున్నది. ద్రావిడదేశ మున మాత్రమే శాస్త్రప్రకారములైన ఆలయములు అధికముగ యేర్పడినందున, ఆలయానుష్ఠానమునకు కైశికము అవశ్యమయి, అరవ పంచాంగములలోనే ఇట్లు వ్రాయబడుచున్నది. కైశిక ఏకా దశినాడు కైశికగానము చేయవలెననియు ఆగమ విధిగలదు. కైశికో త్సవమునకుండు ఆగమ వచనములు అనుబంధములో చేర్పబడు చున్నవి; అందులో చూడుడు. కైశికగానములో కైశికమాహాత్మ్య పఠనముకూడ భట్టరు వారిచే ప్రవర్తితము కావున, సకల విష్ణు సన్ని ధులలోను ఉత్థానోత్సవమునకు కైశికోత్సవమనియే పేరు ఏర్పడినది. ఉత్థానోత్సవము వేరు; కైశికోత్సవము వేరు. ఉత్థానోత్సవములో

కైశికోత్సవము ఒక కార్యము. కైశికోత్సవమున కైశికగానము చేయుట నిలిచిపోయి, కైశికమాహాత్మ్యము పఠించుట మాత్రమే జరుగుచున్నది.

7. తులసీ వివాహము—

భగవంతుడు ఉత్థాన ద్వాదశినాడు సాయంకాలమున తులసీ దేవిని వివాహము చేసికొన్నట్లు శాస్త్రము బోధించుచున్నది. ద్వాదశినాడు సాయంకాలం విష్ణు బింబమునున్ను తులసి చెట్టునున్ను కలిపిపెట్టి వివాహము చేయించవలెనని ధర్మశాస్త్రములలో చెప్పబడియున్నది. ఈ తులసీ వివాహము మధ్వులచేతనే విశేషముగ ననుష్ఠింపబడుచున్నది.

8. ఉతానోత్సవ ప్రకారము—

దశమినాడు సాయంకాలం అంకురార్పణము, ఏకాదశినాడు రక్షాబంధన పూర్వకముగ చతుఃస్థానార్చనము, పెరుమాళ్లకు స్నపనము. రాత్రి మంచు కాలము కావున భగవంతునికి పై కప్పు సమర్పించి పచ్చ కర్పూర తాంబూలమున్ను కర్పూర ఆరతిన్ని సమర్పించవలెను. అర్చకులు బ్రాహ్మణులతో నాడు ఉపవాసముండి—పుణ్యప్రసిద్ధములైన కథలు, స్తోత్రరూపములైన గానములు, నర్తన తాళములతో కూడిన జయఘోషము—మున్నగునవి చేయుచు రాత్రియంతె మేలుకొనియే ఉండవలెను. ద్వాదశినాడు పురాణాదులను పఠించి మంత్రమూర్తియగు భగవంతుని లేపవలయును. నాడు భగవత్సన్నిధియందు పురాణాదులను పఠించువారికిన్ని వినువారికిన్ని పుణ్యము కలుగును. ద్వాదశినాడు ఉషఃకాలములో కైశిక గానము చేసి ప్రత్యూషారాధనము చేయవలెను.

9. శ్రీరంగములో కైశికోత్సవము జరుగు వివరము—

కైశికోత్సవమునకు కాలము, శాస్త్రవిధి, భట్టరువారి సంబంధము - ఇవన్నీ చెప్పబడినవి. భట్టరువారిచే ప్రసిద్ధినొందిన ఈ ఉత్సవము శ్రీరంగములో జరుగు క్రమము ఇప్పుడు వివరింపబడును.

పూర్వ దినమున – అనగా దశమినాడు సాయంకాలం అంకు రార్పణము. ఏకాదశినాడు ప్రొద్దున ప్రతిదినము నేర్పడిన ప్రథమారాధనమున్ను పొంగలి నివేదనమున్ను అయిన అనంతరం, ప్రతి ఏకాదశికిన్ని యేర్పడిన రీతిగ పెరుమాళ్ బయలుదేరి, చందన మండపములో తిరుమంజనము చేసుకొని, తళిగ నివేదనము, తీర్థ ప్రసాద వినియోగము మున్నగునవిని పూర్తి జేసి లోపల వేంచేయుదురు. రాత్రి నివేదనము కావలసిన "శెలశంబా" "అరవణ" మున్నగునవి నేడు సాయంకాలముననే నివేదనము చేయబడి, గర్భగృహమునకు తాళమువేసి ముద్ర వేయబడును.

రాత్రి 10 ఘంటలకు తలుపు తెరచి, పెరుమాళ్ బయలుదేరి పగలు పత్తు మండపము వేంచేయుదురు. "సుప్తే జనే గతే యామే వీణామాదాయ నిర్యయౌ" అను వచన ప్రకారముగ నాడు చండాళుడు భగవంతునికి గానముచేయుటకు బయలుదేరినది రాత్రి ఒక యామమునకుపైన జనులు నిద్రపోయిన పిమ్మట అని తెలియుచున్నందున, భగవంతుడుకూడ ఆ సమయములోనే ఆ ఉత్సవమునకు బయలుదేరుచున్నారు. ప్రతి దినము పెరుమాళ్ల వక్షస్థలములో నుండు ఇంద్రనీల పదకము తప్ప వేరే ఆభరణము నాడు ధరించుట లేదు. పెరుమాళ్ పట్టుదుప్పటా కప్పుకొని, కుల్లాయి ధరించుకొని యుండుటనే నాడు విశేషము. కుల్లాయి ధరించి సాదరా కప్పుకొని యుండు సేవ సకల ఆభరణములతోనుండు శోభకన్న యెక్కువదైయుండును. సకల ఉత్సవములకునుండు వాద్యములతో నాడు మద్దళము, "కొట్టు మద్దళము," ఢక్క, "గారీశంఖ యెక్కాళము"– మున్నగు వాద్యములు నేటి ఉత్సవములో ఘోషించును. మార్గళి ఉత్సవములో నీ వాద్యములు గలవు.

పెరుమాళ్ బీబినాచ్చియారుకు తమ ఒయ్యారనడను చూపించుకొని అరయర్ల కొండాటముతో పడిమేతము ననుభవించి మండపము వేంచేసిన వెంటనే తెర వేయబడును. "శ్రీపాదం తాంగులు"

(పెరుమాళ్లను వేంచేపు చేయువారు) "పచ్చవడ" పెట్టిని తెర్చు దురు. పెరుమాళ్లను సింహాసనమందు వేంచేపుచేసి "పచ్చవడము" సమర్పించుటకు ప్రారంభమగునపుడు తెర దీయబడును.

(1) పచ్చవడము—అనగా వస్త్రము. వడమనునది అరవములో పేనబడిన వస్తువగు త్రాడు మొదలగునవి. వడమను పేరు వస్త్రమునకు యేర్పడిన కారణమేమనగా—ఉత్తరీయమును వడవేసి నడుమున కట్టుకొనుటను చౌక్కాయిపైన ధరించు నాగరికమున్ను గలవు. కావున, వడమనగా వస్త్రమని అర్థము. పచ్చవడమనగా వర్ణవస్త్రము, చిత్రవస్త్రము — అని అర్థమగును. పెరుమాళ్లకు కైశిక యేకాదశినాడు సమర్పింపబడు పచ్చవడములన్నియు పట్టు ఉత్తరీయములుగ నుండును. పచ్చవడము – అనగా వర్ణవస్త్రమని భావముచేతనే శ్రీరంగరాజచరితభాణమందు నిదే కైశిక ప్రస్తావమున "అంగావృతిం చిత్రపటైర్విధాయ" అని చిత్రపటశబ్దము ప్రయోగింపబడియున్నది.

(2) పచ్చవడము సమర్పించు క్రమము :— తెరదీయునపుడు పచ్చవడము సమర్పించుట సేవయగును. పచ్చవడములన్ని మొత్తము 360. అన్నిటిని పెరుమాళ్ తిరుమేనిలో సమర్పించుట అసాధ్యము కావున, వారికి వెనుక నుండు దిండు మీద సమర్పించుట యల వాటు. పచ్చవడము సమర్పించిన అనంతరం, పచ్చకర్పూరము కలుపిన తాంబూలమును భగవంతునికి ఆరగింపు చేయించి కర్పూరారతి చేయబడును. ఒక పచ్చవడము, ఒక తాంబూలము, ఒక కర్పూరారతి— ఈ క్రమములో 360 ఆవృత్తి జరుగును. ప్రతిసారి స్థానికులు "తిరువడి విళక్కువదేల్" "అడకాయముదు సీట్టువదేల్," "తిరువిళక్కు తూండువదేల్"— అని అరుళిపాటు చెప్పగ, ఆయా కైంకర్యపరులచేత "నాయింది, నాయిందే" అని చెప్పుకొని, వెండి పళ్ళెములో పచ్చవడము, వెండి గిన్నెలో తాంబూలము, వెండి తట్టలో వెలిగించిన కర్పూరమున్ను అర్చకులవద్ద నీయబడును. అర్చకులు

పచ్చవడమును పెరుమాళ్ళ దిండుమీద సమర్పించి, తాంబూలమును పెరుమాళ్ళకు ఆరగింపు చేయించి కర్పూరారతిన్ని చేయుదురు.

(3) తిరుక్కురుంగుడి పాశుర విన్నపము :—పచ్చవడము సమర్పించుటకు అరంభమయిన వెంటనే, కోయిల్ మహాజన కైంకర్య పరులు పట్ట కొట్టి త్రోవ విడిపించి, అరయర్లను పెరుమాళ్ళ దగ్గర వేంచేపింతురు. అరయర్లకు అరుళపాటు, సేవ, తీర్థము, చందనము, "తోంగు పరివట్టము," మాల, శఠకోపము మొదలైన సేవ మర్యాదలు జరుగును. అరయర్లు పెరుమాళ్ళ కెదుట గోష్ఠిమధ్యనుండి కైశిక మాహాత్మ్య చరిత్రము జరిగిన తిరుక్కురుంగుడి విషయముగ తిరుమంగయాళ్వార్లు సాయించిన "అక్కుంపులియిన్" తిరుమొళి పాశురములను, నమ్మాళ్వార్లు సాయించిన "ఎంగనేయో" తిరువాయిమొళి పాశురములను తాళస్వరముతో విన్నపింతురు. ఆ తిరుమొళిలో మొదటి పాశురమగు అక్కుంపులయినుకు మాత్రమే అభినయ వ్యాఖ్యానములు జరుగును. అభినయ వ్యాఖ్యానములతో ఈ మొదటి పాశురము పూర్తికాగానే, తక్కిన పాశురములు విన్నపింపబడును. పెరియ వాచ్చాన్ పిళ్ళగారి వ్యాఖ్యానమే (శ్రీ)కోశమును చూచి చదువబడును. పెరుమాళ్ పచ్చవడము ధరించుకొనియే పాశురములను వినుదురు. పెరుమాళ్ ఆరగించిన తాంబూలమున్ను పచ్చకర్పూరమున్ను పాశురములను విన్నపించుచుండు అరయర్లకు ఐదుసార్లు అరుళపాటుతో వినియోగింపబడును. ప్రతిసారి అరయర్లు విన్నపమును నిలిపి, పెరుమాళ్ల దగ్గర వచ్చి తాంబూలమును పుచ్చుకొనుదురు.

తిరుమొళి పూర్తి కాగానే, పచ్చవడము సమర్పించుట నిలుపబడి తెర వేయబడును. మడప్పళ్ళినుండి వెండి తట్టలోను కంచు తట్టలోను వడపప్పు వచ్చి ఘంటానాదముతో పెరుమాళ్లకు ఆరగింపు చేయబడును.

వడపప్పు ఆరగింపు చేయించి తెర తీయగనే, అరయర్లు తిరు

క్కురుంగుడి విషయమైన "ఎణ్ణానేయో—" తిరువాయ్ మొఴిని విన్నపింతురు. పచ్చవడము సమర్పించుటకూడ ప్రారంభమగును. ఈ తిరువాయ్ మొఴిలో మొదటి పాశురమగు "ఎణ్ణానేయో" అను దానికి మాత్రమే అభినయ వ్యాఖ్యానములు జరుగును. తిరువాయ్ మొఴి వ్యాఖ్యానమగు ఈడు శ్రీకోశమును చూచియే చదువబడును. నంబెరుమాళ్ సన్నిధిలో తిరువాయ్ మొఴికి నంబిళ్లై ఈడు, ఇతర ప్రబంధములకు పెరియవాచ్చాన్ పిళ్లై వ్యాఖ్యానము, పెరియ వాచ్చాన్ పిళ్లై వ్యాఖ్యానము లేని పెరియాఴ్వార్ తిరుమొఴిలో కొన్ని భాగములకు మణవాళమామునుల వ్యాఖ్యానము, అక్కడక్కడ అరయర్ల పూర్వీకులైన తంబిరాన్ మార్ వ్యాఖ్యానము—ఇవి దప్ప ఇతర వ్యాఖ్యానములు సేవింపబడవు. "ఎణ్ణానేయో" పాశురమునకు అభినయ వ్యాఖ్యానములు పూర్తి కాగానే, ఆ తిరువాయ్ మొఴిలో నుండు ఇతర పాశురములను విన్నపించి, అరయర్లు పెరుమాళ్లకు వాఴితిరునామము చెప్పి మంగళము పాడుదురు. పెరుమాళ్ కంచు తట్టలో ఆరగించిన వడపప్పు అరయర్లకు వినియోగము చేయబడును.

తిరుక్కురుంగుడి విషయమగు "అక్కుంబులియిన్"—తిరుమొఴి, "ఎణ్ణానేయో"—తిరువాయ్ మొఴి ఈ రెండు దప్ప "తవళవిళంబిరై" తిరుమొఴిన్ను ఇతర ఆఴ్వార్ల పాశురములున్ను గలవు. కాని, అవి నేటి కైశిక ఏకాదశి ఉత్సవమునకు శ్రీరంగములో సేవింపబడవు. అన్ని పాశురములను నేడు విన్నపము చేయని కారణము ఊహింపదగినది. కోయిల్ తిరుమొఴి తిరువాయ్ మొఴిలో చేరిన తిరుక్కురుంగుడి పాశురములు మాత్రమే నేడు శ్రీరంగములో సేవింపబడుచున్నవి. తిరుక్కురుంగుడి పాశురములన్ని ఆఖరున చేర్చబడియున్నవి. కైశికగానము జేసిన నంబాడువాన్ చరిత్రమును వినే ఈ ఉత్సవములో నంబెరుమాళ్ తిరుక్కురుంగుడి పాశురములను వినుట—తిరుక్కురుంగుడి నంబాడువానుని కన్న ఊరు, అచ్చటి పెరుమాళ్ నంబాడువానికి ప్రత్యక్షము, ఈ కైశిక వృత్తాంతము నవతరించునట్లు కృపచేసినవారను కారణముచేత ఉపకార స్మృతియగును.

(4) భట్టరువారు కైశిక మాహాత్మ్యము చదువుట :— అరయర్లు పాశురవిన్నపము చేయుచుండగ, భట్టరువారిని తిరుమాళిగ నుండి వేంచేపించుటకు మణియగార్లు కోయిల్ మహాజనం కైంకర్యపరులును పంపుదురు. భట్టరువారు పెరుమాళ్ల "కాప్పందము," మేళవాద్యము—మొదలైన పరికరముతోను తమశిష్యులు మొదలైనవారితోను బయలుదేరి ప్రదక్షిణముగ "కీళప్పడి"యెక్కివచ్చి, సన్నిధిద్వారములో దండం సమర్పించి, అళగియ మణవాళన్ తిరుమండపములోనే వేంచేసియుందురు. అరయర్ సేవ పూర్తిఅయిన వెంటనే, మణియగార్లు భట్టరువారికి దండం సమర్పించి, వారిని పెరుమాళ్లవద్ద వేంచేపింతురు. స్థానికులు పెరుమాళ్ల ఆజ్ఞపుచ్చుకొని భట్టరువారికి అరుళిపాటు సాయింతురు. భట్టరువారు పెరుమాళ్ల దగ్గరవచ్చి కైశికపురాణ శ్రీకోశమును స్థానికులచేతికి ఇత్తురు. దానిని అర్చకులు పుచ్చుకొని పెరుమాళ్ల తిరువడిలో నుంచుదురు. భట్టరువారికి తీర్థము, చందనము, తొంగుపరివట్టము, మాల, శ్రీశఠకోపము—మొదలైన ప్రసాద మర్యాదలు జరుగును. భట్టరువారు కైశికపురాణమును పుచ్చుకొని గోష్ఠికి సమీపముగ వెళ్లి, "శ్రీశైలేశదయాపాత్రము" మొదలు "శ్రీపరాశరభట్టార్యః"— వరకునుండు ఆరు తనియనులను అనుసంధానముచేసి, కైశిక పురాణమును అవతారిక వ్యాఖ్యానములతో చదువుదురు. పురాణమును చదువుచున్నపుడే అరయర్లకువలె భట్టరువారికిగూడ అరుళిపాటుతో పది సార్లు పచ్చ కర్పూర తాంబూలము వినియోగింపబడును. ప్రతిసారి భట్టరువారు పురాణమును నిలిపి, పెరుమాళ్ల దగ్గర పోయి తాంబూలమును పుచ్చుకొని, మరల గోష్ఠిమధ్యన వెళ్లి పురాణమును ఆరంభింతురు.

భట్టరువారు చదువు క్రమములోనే కైశిక మాహాత్మ్యమిందు చేర్పబడియున్నది. పురాణము శ్రీకోశమును చూచియే చదువబడును. పురాణము పూర్తికాగానే, పెరుమాళ్ ఆరగించి వెండి తట్టలోనుండు వడపప్పు భట్టరువారికి వినియోగము చేయబడును.

కైంకర్యపరులు భట్టరువారిని పెరుమాళ్ల కాప్పందము మేళవాద్యము మొదలైనవానితో తిరుమాళిగలో విడిచివత్తురు.

(5) పెరుమాళ్ బయలుదేరుట :—భట్టరువారు తిరుమాళిగ వేంచేసిన పిమ్మట పెరుమాళ్లకు వేదవిన్నపము (పుష్పాంజలి) అగును. మడప్పళ్లినుండి ఘటదీపము వచ్చును. అనంతరం అలంకారము ఆరగింపుచేయబడి తీర్థప్రసాద వినియోగ మగును. ఈ ఉత్సవములో పెరుమాళ్ళకు తిరువారాధనము లేదు. తిరువారాధనము లేకనే వేద విన్నపము, ఘటదీపము, తళిగ నివేదనము—మొదలైనవి జరుగును. పెరుమాళ్ బయలుదేరుటకుగాను సూర్యోదయమునకు పూర్వమే సింహాసనమును విడచి తోళుక్కొనిమానులో వేంచేసి భట్టరువారి రాకను ప్రతీక్షించియుందురు. కైంకర్యపరులు పెరుమాళ్ళ సమయమును భట్టరువారికి తెలుపుదురు. భట్టరువారు "నిలయంగి" (నిడుపు అంగి) కుల్లాయి, తొంగుపరివట్టము మొదలైనవిని ధరించి, కైశిక పురాణము నెత్తుకొని, తిరుమాళిగనుండి బయలుదేరి, గుడిలోనికి వచ్చి, ధ్వజస్తంభము దగ్గరనుండు ఉయ్యాలమండప మెట్లమీద కూర్చుందురు. పెరుమాళ్ బయలుదేరి చిలుకల మండపముదిగి, అద్దాల అరదగ్గర వేంచేయగనే, భట్టరువారువచ్చి దండంసమర్పించి పెరుమాళ్ళ వెంబడియే వెళ్లుదురు.

(6) పచ్చకర్పూర పడియేతము :—పెరుమాళ్ అద్దాల అరను విడచి రెండడుగుల దూరము వెళ్లగనే అరయర్లకు అరుళిపాటగును. పెరుమాళ్ అరయర్లు గానముచేయు "ఇశై" సర్వమును వినుచు "మేలప్పడి" వెళ్ళి పడియేతము ననుభవింతురు.

"పాంగుశీర్వాళవబూడణమాంద ఉలగారియన్ పోత్తిడ త్తిగ్రుం పెరుమాళ్!
మన్ని యశీర్మణవాళ మామునె ఈడురైప్పదు కేట్టు పూరిత్తు నిన్ర పెరుమాళ్!"

అను ప్రకారముగ అరయర్లు కొండాటములను గానముచేయుదురు. చాత్తాద వైష్ణవులు పుష్పదళములనున్ను పచ్చకర్పూర పొడినున్ను

కలిపి వెండిగిన్నెలో పెట్టుకొని పెరుమాళ్లమీద జల్లుదురు. ఇట్టి వైభవముతో పెరుమాళ్ ఆడియాడి మెట్లుఎక్కి ఒకేవేగముగ తిరుగుదురు. వెంటనే తిరువందికాప్పు—అనగా కుంభారతి అగును. కైశిక మాహాత్మ్యమవతరించిన నేటిదినములో మాహాత్మ్యమునకు వ్యాఖ్యానము సాయించి తనదగ్గర విన్నపించిన భట్టరువారియెడ్ల కుతూహలముకలిగి, పెరుమాళ్ స్థానికులద్వారా— "నం భట్టరై వీట్టిల్ విట్టు వా" మన భట్టరువారిని ఇంటిలో విడచి రా అని మణియగార్లను ఆజ్ఞాపింతురు. మణియగార్లును "నాయిందే, నాయిందే" అని చెప్పి ఆజ్ఞను శిరసావహించి, భట్టరువారిని పెరుమాళ్ళతో లోపలికి పిలుచుకొని పోవుదురు.

(7) భట్టరువారి బ్రహ్మరథము:—పెరుమాళ్ లోపల వేంచేసిన వెంటనే సన్నిధిద్వారము మూయబడును. పెరుమాళ్ తన మాలను భట్టరువారికి అనుగ్రహింతురు. భట్టరువారు పెరియపెరుమాళ్ళవద్దను అనుగ్రహము పుచ్చుకొని, తలుపు తెరచిన అనంతరం బయటవచ్చి సన్నిధిద్వారములో ద్వారపాలకుల దగ్గరనే నిలచియుందురు. మరల సన్నిధిద్వారము మూయబడును. పెరుమాళ్ తోళుక్కి వియాను నుండి మూలస్థానము వేంచేసిన అనంతరం సన్నిధిద్వారము తెరవబడి మంగళారతి అగును. వెంటనే అర్చకులు శ్రీశఠకోపమును తెచ్చి సన్నిధిద్వారమునకు బయటనుండు భట్టరువారికి సాయింతురు. "నట్టు ముట్టు" వాద్యఘోషముతో భట్టరువారు శ్రీశఠకోపమును పుచ్చుకొని తమ శిష్యులతోను, కైంకర్యపరులతోను, మేలప్పడి దిగి, సేనమొదలియార్ సన్నిధిలో సేవ మర్యాద పుచ్చుకొని ప్రదక్షిణముగ పోయి, ఆర్యభటాళ్ వాకిలిలోనుండు "కేడయములో" కూర్చుందురు. శ్రీపాదతాంగులు కేడయము నెత్తుకొని దక్షిణద్వారమార్గముగ ఉళ్ తిరువీది ప్రదక్షిణముచేసి భట్టరువారిని తిరుమాళిగలో దింపుదురు. త్రోవలో గరుడమండపమున గరుత్మంతుడున్ను, నమ్మాళ్వార్లున్ను మాల సాయింతురు; రంగ విలాసములో కూరత్తాళ్వాన్ తన సన్నిధి

కెదుట మాలసాయింతురు; ఉత్తరద్వారమున పెరియపిరాట్టి యారున్ను మేట్టుఅగియ శింగరున్ను మాల సాయింతురు. తిరుమాళిగలో దేవదాసీలు ముత్యారతి యెత్తిన అనంతరం భట్టరువారు కేడయమునుండి దిగి లోపల వేంచేయుదురు. అరయర్లు వచ్చి తాళస్వరముతో పెరుమాళ్ చూర్ణాభిషేకమును ధరించునపుడువలె పల్లాండు పాడిన అనంతరం, స్థానికులు గోష్ఠికి చందన తాంబూల వినియోగము చేయుదురు. భట్టరువారికి బ్రహ్మరథ మయినపిమ్మట, నాటి ప్రొద్దున రావలసిన తిరుమంజనము వచ్చి దినచరి కార్యములగును. నెన్నటి కార్యములన్ని పూర్తి అయి తాళముద్రలు వేసిన అనంతరం, రాత్రి కైశిక మాహాత్మ్య శ్రవణముకొరకై జరిగిన ఈ ఉత్సవము నెన్నటి ఉత్సవములోను నేటి ఉత్సవములోను చేరక, అవాంతర ఉత్సవమగును.

(10) తిరుక్కురుంగుడి—

కైశిక వృత్తాంత మవతరించిన తిరుక్కురుంగుడిలో నేడు యేమి జరుగునని ప్రశ్న కలుగుట సహజమే. అచట నేడు నంబాడువాన్ చరిత్రము నాటకముగ నటింపబడుచున్నది తెలిసి అక్కడ పోయి సేవించిన ప్రకారముగనే వ్రాయబడుచున్నది.

తిరునెల్వేలి స్టేషనునుండి 24 మైళ్లు పడమటనున్నది తిరుక్కురుంగుడి. మార్గమున 16 మైళ్లు దూరములో వానమామల ఉన్నది. తిరునెల్వేలినుండి సులభముగ బస్సు దొరుకును.

తిరుక్కురుంగుడిలో ప్రవహించు క్షీరనది, పాలారు, సింధునది, నంబియారు—అని పేర్లుగల చిన్ననదియగును. అది తిరుక్కురుంగుడి సమీపమున పారుచున్నది. తిరుక్కురుంగుడి జలరామణీయకము స్థలరామణీయకము కలిగి, ఆరామములునిండి అందముగను ఆరోగ్యముగనుండు ఊరు. దానికి దక్షిణబదరి, సౌకరవక్షేత్రము, సిద్ధాశ్రమయు, వామనక్షేత్రము—అని పలుపేర్లు పురాణములయందు గనబడుచున్నవి.

గుడిలోపల నిన్నసంబి, ఇరుందనంబి, కిడందనంబి-అనిముగ్గురు నిలుచుకొని, కూర్చొని, పండుకొని ఉన్నారు. వీరిలో నిన్న నంబియే ప్రధానము. వీరికి తిరుక్కురుంగుడి నంబి, అళగియనంబి, వైష్ణవనంబి, సుందరపరిపూర్ణుడు - అని పేర్లు గలవు. పెరుమాళ్ అతి సుందరుడు గా నుండుటచే అళగియనంబి, సుందరపరిపూర్ణుడు - అని పేర్లు యేర్ప డినవి. వీరు ఉడయవర్ల యొద్ద పంచసంస్కారము నొందిన నిమిత్త మై వైష్ణవనంబి అని పేరు యేర్పడినది. ఇచ్చట ఉడయవర్లు ఆచా ర్యులుగాను పెరుమాళ్ శిష్యులుగాను ఉండుటవలన గర్భగృహ మందు ఉడయవర్లు ప్రత్యేకముగ నాచార్యస్థానములో వేంచేసి యున్నారు. ఈ గుడి ఐదు ప్రాకారములు గలది. గర్భగృహమునకు ప్రక్కని ప్రాకారములో ఎడమచెయి ప్రక్కన శట్టనాథుడున్ను కాల భైరవుడున్ను ఉన్నారు. తిరుమంగయాళ్వార్లు "పక్కంనిన్న శివ నాక్"—ప్రక్కనుండు శివుడు అని ఈ శివునికూడ పాశురమున చేర్చియున్నారు. వీరి పూజకు ప్రత్యేకముగ శివద్విజులు గలరు. తిరుక్కురుంగుడి వైఖానసాలయము.

గుడిలోనుండు మూడు పెరుమాళ్ళుతప్ప, గుడికి నైఋతి మూలలో ఊరికి బయట "తిరుప్పార్కడల్ నంబి" అని పేరుగల వామనమూర్తియొక్క ఆలయము పల్లములోనున్నది. మహేంద్ర పర్వతమధ్యన "మలనంబి" అను పెరుమాళ్లు వేంచేసియున్నారు.

తిరుక్కురుంగుడి తిరుమంగయాళ్వార్లు పరమపదించిన స్థలము. ఊరికి ఉత్తరముగ పొలముమధ్యన ఒక తిరుమంగయాళ్వార్లు వేంచేసి యున్నారు. కార్తికలో కార్తిక తిరునక్షత్రమునాడు సన్నిధిలో తిరు మంగయాళ్వార్లున్ను పెరుమాళ్లున్ను తళిగ ఆరగించిన పిమ్మట పొలము మధ్యమునుండు తిరుమంగయాళ్వారికి తళిగ ఆరగింపించి పిమ్మటనే గుడిలో గోష్ఠికార్యములు జరుగును.

తిరుప్పార్కడల్ నంబి సన్నిధికి దక్షిణముగ ఆ నదీతీరములో "తిరుమణ్ పార" - అనునొక రేవుక్రింద ఉడయవర్లు వైష్ణవనంబికి

పంచసంస్కారము చేసిన చోటు తెలియుచున్నది. ఉడయవర్లున్ను వడుగనంబియున్ను అనంతశయనముబోయి, పెరుమాళ్ళను సేవించి వచ్చినవుడు, రాత్రి ఈ రేవుక్రింద విశ్రమించినట్లు, అచ్చట తిరుక్కురుంగుడి పెరుమాళ్ వచ్చి వారిద్దరిని ఉపచరించినట్లున్ను ప్రసిద్ధి. రేవుక్రింద వడుగనంబితో వేంచేసియుండు ఉడయవర్ల ప్రక్కన తిరుక్కురుంగుడి పెరుమాళ్లు అంజలిహస్తులుగనుండు బింబములు గనబడుచున్నవి. రేవుకు క్రిందబోయి దర్శించుటకొరకై మెట్లుకట్టబడియున్నవి. పైన ఉడయవర్ సన్నిది ఒకటి గలదు. ఇవుడు ప్రస్తావించిన అన్ని ఆలయములున్ను కలిసి ఒకటే దేవస్థానము.

ఉడయవర్లిచ్చట స్థాపించిన పేరరుళాళ రామానుజజియ్యర్ అను తిరుక్కురుంగుడి జియ్యంగారే ఈ దేవస్థానమున కధికారి. ఈ జిల్లాలోనుండు పెరియనంబి వంశ్యులే ఈ జియ్యంగారి స్థానమునకు వచ్చుచున్నారు. ఈ జియ్యంగారి మఠము గుడియొక్క మొదటి గోపురమునకున్ను రెండవ గోపురమునకున్ను మధ్యన ఉత్తరపార్శ్వముగ నున్నది. ఈ మఠములో గూడ ఉడయవర్లు వేంచేసి యున్నారు.

జియ్యర్ మఠముయొక్క వాకిలిలోనుండు స్తంభములలో శిల్పకౌశలము నిండిన ఆశ్చర్యమైన బింబములున్నవి. చిత్రగోపుర మను గోపురములో ఆశ్చర్యమైన శిల్పముగల పై వితానముతో ఏడు అంతస్తులు గలవు. దంతములో చేయదగిన అతిసూక్ష్మమైన ప్రతిమలు ఆ చిత్రగోపురములో రాతిమీాద చెక్కబడి యున్నవి.
తిరుమళిశ ఆళ్వార్లు తిరుచ్చంద విరుత్తములో

కరండమాడు పాయ్గైయుళ్ కరుంబనై ప్పెరుం పళ్ళం
తిరండు తీళ్ళ వాళై పాయ—

అని పాడిన ఒక తాటిచెట్టు ఇంక కారండవ పుష్కరిణి తీరములో నుండుట ఈ క్షేత్రమందొక ఆశ్చర్యము.

ఈ ఆలయపు ధ్వజస్తంభము ద్వారమునకు నేరుగా లేకుండ ఉత్తరపార్శ్వముగ ఒదిగియున్నది. నంబాడువాన్ అను చండాలుడు

"దూరాజ్జాగరణే గాత్తి—తన్ జాత్తిక్కను గుణముగ దూరత్తిలే నిన్ను పాడినాన్" తనజాతిక నుగుణముగ దూరముననే యుండి పాడెను అనినట్లు సన్నిధి ద్వారమునకు రాజాలక బయటనేయుండి గానము చేయునపుడు, వానికి భగవద్దర్శనము కలుగునట్లు ధ్వజస్తంభము కొంచెం అవతల జరిగినట్లు అప్పటినుండి అది అట్లులనే నిలిచియున్నట్లు చెప్పుచున్నారు. ఏతావతా ఊరు, గుడి మున్నగునవి దాని వివరము చెప్ప బడినది. ఇక నక్కడ జరుగు కైశిక ఉత్సవ వివరము.

11. తిరుక్కురుంగుడి కైశికము: ఏకాదశి తిరుమంజనము—

కైశిక యేకాదశికి పదిరోజులు మునుపు నాటక పాత్రలైన నంబాడువాన్, బ్రహ్మరక్షస్సు, నంబివృద్ధుడు — ముగ్గురున్ను పెరుమాళ్లను సేవించి వారనుగ్రహించు టెంకాయను పుచ్చుకొని కారండవ పుష్కరిణి తీరముననుండు కృష్ణ మందిరములో నాటకము నభ్యసించుటకు వ్రతము దొడంగుదురు. వీరిలో నంబాడువాన్ నంబి వృద్ధుడు— ఈ రెండు పాత్రములున్ను ఆ దేవాలయపు భోగము వార్లది. బ్రహ్మరక్షస్సుగ నటించవలసినవాడు పెరుమాళ్ల తిరుమేని క్కావలివాడు. వీరు పదిరోజులు ఏక భుక్తముగనుండి ఏకాదశినాడు ఉపవాస ముండవలయును. దాసీలు పదిరోజులున్ను ఇంటిలోనే వ్రత ముందురు. బ్రహ్మరక్షస్సుగ నటించువాడు పదిరోజులున్ను ఉదయ మున స్నానము జేసి వచ్చిన పిమ్మట గుడివిడచి అవతలపోక నే ఉండును.

ప్రతిదినమువలె ఏకాదశినాడు ప్రొద్దున తిరుమంజనము వచ్చి విశ్వరూపమగును. అనంతరం ఛత్ర చామరములు, ఏనుగు, గుఱ్ఱము మొదలైన బిరుదులతో అలంకార తిరుమంజనము తిరువీది ప్రద క్షిణముగ వచ్చును. పెరుమాళ్ "శుక్రవారకొరటుకు" క్రింద కుల శేఖర మండపమున మజగిరిలో తనిక్కోయిల్ నాచ్చియారుతోను ఉభయ నాచ్చియార్లతోను అలంకార తిరుమంజనము ననుభవింతురు. గోష్ఠికి ఈరవాడ తీర్థవినియోగము మొదలైనవి అయిన తరువాత పెరుమాళ్ వెనుకనుండు శుక్రవారకొరటులో వేంచేసి, తిరువారా

ధనము జరిగి బలి సాయింపబడును. అనంతరం తిరుమంగయాళ్వార్ల ఆరవ ఉత్సవపు గోష్ఠి జరుగును. కైశిక ఏకాదశి ఎప్పటికి ఉత్తర ప్రోష్టపదిలోనే వచ్చునుకావున, నాడు కార్తిక కార్తికలో అవతరించిన తిరుమంగయాళ్వారికి ఆరవ ఉత్సవము కలియును. సామాన్యముగ కైశికము ముందున్ను, తిరుకార్తి వెనుకన్ను వచ్చును. అట్లు వచ్చినయెడలనే కైశికమునాడు తిరుమంగయాళ్వారి ఆరవ ఉత్సవము కలియును. తిరుకార్తికకు వెనుక కైశికము వచ్చినయెడల తిరుమంగయాళ్వారి ఉత్సవము కైశికముతో సంబంధించదు. తిరుమంగయాళ్వార్లు బయలుదేరి శంఖా తిరువారాధనము ననుభవించి, తళిగ ఆరగించిన పిమ్మట, గోష్ఠికి తీర్థ వినియోగము. సాయంకాలము పెరుమాళ్లకు తిరువారాధనము జరిగి "అత్తాళ" తళిగ నివేదనమయిన అనంతరం, తీర్థ వినియోగమయి బలి హరణమగును.

(1) కైశిక మండపము వేంచేయుట:—రాత్రి కైశికఉత్సవము కొరకై ఆళ్వారాచార్యులందరున్ను కైశిక మండపము వేంచేయుదురు. శ్రీరంగమువలె ఇచ్చట ఆళ్వారాచార్యులందరు ప్రత్యేకముగ వేంచేసియుండరు. ఒక వేదికలోనే అందరు వేంచేసి యుందురు. రాత్రి పెరుమాళ్ ఉభయ నాచ్చియార్లతో బంగారపు తోళుక్కినియానులో "తవళ శిబిక" కట్టి బయలుదేరి, "వట్ట విళక్కు" వర్తుళదీపమునకుముందు తిరుమంగయాళ్వార్ల సన్నధి వాకిలికి వేంచేయుదురు. జియ్యంగారు వేంచేసిన అనంతరం, మఠము వగైరా "తిరుక్కాప్ శాత్తు" తాంబూలము, ఫలము మున్నగునవి ఆరగింపు అయి కర్పూరసేవ అగును. ఆళ్వార్లకు శ్రీశఠకోపమయిన అనంతరం గోష్ఠికి తీర్థ వినియోగము. వెంటనే "ఇయల్" ఆరంభించుటకు అరుళపాటగును. మణవాళమాముని సన్నిధిలో జరుగు ఇయల్‌చాత్తు నేడు అక్కడ జరగదు. పెరుమాళ్ కైశిక మండపము వేంచేసిన అనంతరం అక్కడనే ఇయల్ చాత్తు అగును. మేనాలో తనిక్కోయిల్ నాచ్చియార్ బయలుదేరి వచ్చి పెరుమాళ్ల దగ్గర వేంచేసిన తరువాత, రాజ మర్యాదగ పొంగలి, మఠం తిరుక్కాప్ చాత్తు ఇవి సమర్పింప

బడును. జియ్యంగార్లు రాజమర్యాదను పుచ్చుకొని మఠమునకు వేం చేయుదురు. అచ్చట తాంగలి వినియోగము.

(2) కైశిక నాటకము :— కైశిక మండపమందు పెరుమాళ్ తూర్పు ముఖముగ వేంచేసియుందురు. కైశిక మండపమునకు బయట నొక పెద్ద మండపమున్నది. ఈ బయటి మండపములో తూర్పు ప్రక్కన నాటక మేడ వేయబడి యుండును. అందు కైశిక వృత్తాంతము పై చెప్పిన మూడు పాత్రములచే నాటకముగ ప్రదర్శింపబడును. నాటకమునకు అవశ్యమైన మాటలు పాటలు మొదలైనవి తాళపత్ర పుస్తకమున నరవములో వ్రాయబడి గుడికి చేరిన దేవదాసీల యొద్దనే యున్నవి. ఆ పుస్తక ప్రకారముగనే నాటకము నటింపబడు చున్నది. తాళపత్రములో నుండు విషయము లెవరిచే వ్రాయబడిన వని తెలియదు. నాటకముగ నటించుటకుగాను ఆపుస్తకమందు సమయోచితముగ ననేక విషయములు గలవు. అందు తిరుక్కురుంగుడి పెరుమాళ్ల వైభవమున్ను కైశిక వృత్తాంతమున్ను మిక్కిలి రసవంతముగ వ్రాయబడియున్నవి. ఈ విషయములను ప్రసిద్ధపరచిన రసికులకు సంతోషముగ నుండును. పుస్తకములో నుండు విషయమును సరిగ జెప్పుటకు గూడ తెలియక నాటకము జరుగుచున్నది. నాటకము కొరకై అన్ని సిద్ధముగ నుండగ, బ్రహ్మరక్షస్సు వేషధారి గుడికి వెనుకనుండి మేళ తాళములతో ప్రదక్షిణముగ వచ్చి, కైశిక మండపమున కుత్తర పార్శ్వముగనుండు గదిలో ప్రవేశించి, అచ్చటనుండు బ్రహ్మరక్షస్సు శిరస్సునకు పూజజేసి, దానిని ధరించును. కొయ్యతో జేయబడిన ఆ బ్రహ్మరక్షస్సుని శిరస్సు చాలకాలముగ గుడిలోనే యున్నది. అది ఈ గదిలోనే ఉండును. దానిని పూజజేసి తలలో పెట్టగనే, ఆ వేషధారికి ఆవేశము వచ్చుచున్నది. ప్రక్కనుండువారు సమాధానము జేసి అతనిని నాటక మేడకు పిలుచుకొని వత్తురు. వాడు వచ్చిన పిమ్మట నాటకము ప్రారంభమగుచున్నది. నాటకము పూర్తి అయిన మీద పాత్రధారులకు పెరుమాళ్ల దగ్గర సేవ మర్యాదలు జరుగును. అనంతరం వార్లు మేళతాళాదులతో నింటికి బోవుచున్నారు.

(3) తిరుక్కురుంగుడి పాశురము:— దాసీలు మర్యాద పుచ్చు కొని ఇల్లుచేరిన అనంతరం పెరుమాళ్లకు తిరువారాధనము జరుగును. తళిగ ఆరగింపయి కర్పూర సేవ; "సేవాకాలము" దొడంగుటకు అరు శపాటు; "శ్రీశైలేశ-" మొదలుగనుండు ఐదు తనియనులను, తిరు మొళితనియనుల ననుసంధానముజేసి "తవళవిళంబిరై" తిరు మొళి సేవింపబడును. శ్రీవిల్లిపుత్తూరి అరయర్లు వచ్చి "అక్కాం బులియిన్"-పాశురమునకు అభినయ వ్యాఖ్యానములను జరిపిన అనం తరం అధ్యాపకులు "అక్కాంబులియిన్ తిరుమొళిలోనుండి ఇతర పాశురములను సేవింతురు. తిరువాయ్ మొళిలోనుండు "ఎణ్ణా నేయో" పాశురమునకు అరయర్ల భినయవ్యాఖ్యానములు జరి పిన పిమ్మట, ఇతర పాశురములు సేవింపబడును. తిరువాయ్ మొళి చాత్తుమొర అయిన మీాద పెరుమాళ్లకు "శురుళముదు" తాంబూ లము సమర్పింపబడును. నాడుజరిగినకార్యములను విన్నపము చేయుట అయిన వెనుక, పెరుమాళ్లు తిరుమంగయాళ్వారికి తీర్థప్రసాదము ననుగ్రహింతురు.

(4) కైశిక పురాణము :— గోష్ఠికి తీర్థ వినియోగమయిన అనంతరం స్థానికులు కైశిక పురాణమును భట్టరువారి వ్యాఖ్యానావ తారికల సహితముగ తాళకోశమును చూచి చదువుదురు. ఇంత జరుగునపుడు సూర్యోదయము సమీాపించును. నేటికార్యములన్ని పూర్తి అయి గూడ, పెరుమాళ్ గర్భ గృహము వేంచేయక కైశిక మండపములోనే ఉందురు. అచ్చట తిరువుత్త యామము—అనగా రాత్రి అర్థజామ పూజ.

(5) కైశిక ద్వాదశి :— కైశిక ద్వాదశినాడు నిత్యపడి తిరుమం జనము వచ్చును. కైశిక మండపములోనే విశ్వరూప గోష్ఠి. మధ్యా హ్నా మలంకార తిరుమంజనము వచ్చి, కుంభస్థాపనము జేసి పెరుమాళ్లకు బహిరంగముగ తిరుమంజనము. అనంతరం కాలసంధి; తిరుమంగయాళ్వారి ఏడవ ఉత్సవము; శంబా అవసరము; సాయం

కాల తిరువారాధనము; అత్తాళ అవసరము; తీర్థ వినియోగము—అన్ని జరిగినమీద, ఆళ్వారాచార్యులు బయలుదేరి వారి వారి సన్నిధికి వేంచేయుదురు. పెరుమాళ్ తనిక్కోయిల్ నాచ్చియారుని మేనాలో పంపించి ఉభయనాచ్చియార్లతో లోపల వేంచేయుదురు.

(6) రాత్రి గరుడసేవ :— రాత్రి పెరుమాళ్లకు మాత్రం గరుడవాహనము. పెరుమాళ్ గరుడ వాహనమున వేంచేసి అక్కార వడిశ లారగింతురు. అనంతరం కర్పూర సేవ; తీర్థవినియోగము; ఇయల్ తొడక్కము. పెరుమాళ్ బయలుదేరి మఠమున కెదుట నిలచి మఠం తిరుక్కణ్ శాత్తు ఆరగించిన తరువాత,తీర్థ వినియోగము. పెరుమాళ్ రాజగోపురము వేంచేసి తాంబూల మారగించిన మీద టెంకాయ కొట్టుట. తిరువీధి వేంచేసి వచ్చిన అనంతరం—తిరువంది కాప్పు, తిరువారాధనము, తళిగ నివేదనము, తీర్థ వినియోగము. పెరుమాళ్ వాహనమునుండి దిగి పల్లకిలో లోపలికి వేంచేయుదురు.

శ్రీ

# పొదు తనియనులు

(ఇందునుండియే మాహాత్మ్యము చదువబడును)

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిం

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమాం
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరంపరాం

యో నిత్యమచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురోర్భగవతోస్య దయైకసిద్ధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానాం
ఆద్యస్య నః కులపతేర్వకులాభిరామం
శ్రీమత్ తదంఘ్రియుగలం ప్రణమామి మూర్ధ్నా

భూతం సరశ్చ మహదాహ్వయభట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణుపరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మి నిత్యం

# III. కైశిక మాహాత్మ్యము

(మూలము, వ్యాఖ్యానము, టిప్పణియు)

శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః
శ్రీవత్సాంకసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే

---

నమస్తస్మై వరాహాయ లీలయోద్ధరతే మహీం
ఖురమధ్యగతో యస్య మేరుః కణకణాయతే

ప్రలయోదన్వదుత్తీర్ణాం ప్రపద్యేఽహం వసుంధరాం
మహావరాహదంష్ట్రాగ్రమల్లీకోశమధువ్రతాం

జాగరే తు విశాలాక్షి జానతో వాప్యజానతః
యో మే ప్రగాయతే గేయం మమ భక్త్యా వ్యవస్థితః

---

## కైశిక మాహాత్మ్య వ్యాఖ్యాన టిప్పణి

శ్రీ పరాశర—ఇది ఈ కైశిక మాహాత్మ్యమునకు వ్యాఖ్యానము ననుగ్రహించిన పరాశర భట్టరువారి తనియను; కావున, ఇచ్చట ననుసంధేయమయినది.

నమస్తస్మై, ప్రళయ —ఈ రెండు శ్లోకములును వరాహపురాణమునకు వక్తగా శ్రోత్రిగానుండు వరాహస్వామి భూమిదేవి విషయమైనవి. వరాహపురాణారంభములో నీ శ్లోకము లున్నవి. ఆ పురాణమునకే ఇవి ఆరంభశ్లోకములా అనియు, భట్టరువారు వీనిననుసంధానము చేసుకొనియే కైశిక మాహాత్మ్యమునకు వ్యాఖ్యానము ప్రారంభించిరా అనియు తెలియదు. కైశిక మాహాత్మ్య పుస్తకము లన్నిటిలో నివి గనబడుచున్నవి. శ్రీరంగములోనివిగూడ పఠింపబడుచున్నవి. వీటికి వేదాచార్య భట్టరువారు వ్యాఖ్యానము సాయించినట్లు తిరువల్లిక్కేణి వై. మ. అప్పంగార్ స్వామి, 1905-వ సంవత్సరమున ముద్రించిన కైశిక మాహాత్మ్యమునుండి తెలియుచున్నది. ఆ వ్యాఖ్యాన మనుబంధములో నియ్యబడును.

జాగరే తు— ఇది ఈ మాహాత్మ్యమున కారంభశ్లోకము. విస్తారమైన అవ

## అవతారిక

"వేదోఽఖిలో ధర్మమూలం"—అనియు

"పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనం"—అనియు

చెప్పినట్లు అతీంద్రియములైన తత్వహితపురుషార్థములలో ప్రమాణభూతములైన వేదములకు పరికరభూతములైన విద్యాస్థానములు పది. వీటిలో—

---

తారికకనంతరము భట్టరువారీ శ్లోకమునుండియే మాహాత్మ్యమును వ్యాఖ్యానించుచున్నారు. అవతారికకు మునుపే ఈ శ్లోక ముండుటకు కారణము—ఇది భట్టరువారిచే తమ గ్రంథమునకు ప్రతీకముగ నెత్తబడియుండును. కావున, గోమయలేప మాహాత్మ్యమునుండి కైశిక మాహాత్మ్యము ప్రారంభమగునట్లు, మొదట గోమయలేప మాహాత్మ్యమునకు వ్యాఖ్యానము చేసి, ఆనంతరము భట్టరువారు కైశిక మాహాత్మ్యమునకు వ్యాఖ్యానము ననుగ్రహించినట్లున్ను తిరుక్కోయిలూరివారు ముద్రించిన పుస్తకము, పట్టం కోయిలలో సేవింపబడు పుస్తకములున్ను సరియైనవి కావని తోచుచున్నది. గోమయలేప మాహాత్మ్యము వరాహ పురాణమందున్నది. కాని, భట్టరువారిపుడు ప్రసక్తమైన కైశిక మాహాత్మ్యమునకు మాత్రమే వ్యాఖ్యానము సాయించిరి. కైశిక మాహాత్మ్య అధ్యాయారంభములో గోమయలేప మాహాత్మ్యము, భట్టరువారి కాలములోనే ఉండినప్పటికి, ఇపుడు ప్రసక్తమైన గాన మాహాత్మ్యమున కారంభశ్లోకమగు జాగరేతు - అని శ్లోకమునుండియే భట్టరు వ్యాఖ్యానించుట న్యాయము.

తత్వ— తత్వము: చిత్, అచిత్, ఈశ్వరుడు. హితము—పురుషార్థమునకు సాధనములైన ధర్మములు. పురుషార్థము—పురుషునిచే అర్థింపబడు ధర్మార్థకామమోక్షములు.

ప్రమాణ— తత్వహిత పురుషార్థములు అతీంద్రియములు కావున, అనగా ఇంద్రియములచే తెలిసికొనుటకు లేక, వాటి శక్తికి బహిర్భూతములు కావున, వాటిని తెలిసికొనుటకు ఇంద్రియములకన్న వేదమే ప్రమాణము. అతీంద్రియ విషయములయందు శాస్త్రమే ప్రమాణమగు.

పరికర— వేదములే ప్రమాణములైనప్పటికి వేదార్థములను తెలిసుకొనుట కుపకారకములైన విద్యలు గలవు. ఇచ్చట పరికర శబ్దమునకు అంగమనియైన ఉపబృంహణమనియైన చెప్పుటకు వీలు లేక, ఉపకారకమనియే చెప్పవలసియున్నది. వేదాంగములు ఆరు అని పరిగణితమైనందున పరికరము అంగము కాదు. స్మృతీ

1. శిక్షయనునది—వర్ణములయొక్క ఉచ్చారణ విశేష ప్రతిపాదన మాత్ర తత్పరము కావున;

2. నిరుక్తము—వర్ణసామాన్యాదులచే పదార్థ విశేష ప్రతిపాదమందు తత్పరము కావున;

3. ఛందోవిచితి—వర్ణసంఖ్యా విశేష నియత గాయత్ర్యాది చ్ఛందో మాత్ర ప్రతిపాదకము కావున;

4. వ్యాకరణము— వర్ణసముదాయాత్మకములైన పదముల యొక్క సాధుత్వాసాధుత్వమాత్ర వ్యాపృతము కావున;

5. కల్పసూత్రములు—పదసంఘాతరూప వాక్యవిశేషచోదిత కర్మానుష్ఠాన విశేషకల్పనా ప్రవృత్తములు కావున;

---

హాసపురాణములే వేదోపబృంహణములు కావున, పరికరము ఉపబృంహణము కాదు. అంగములకున్ను ఉపబృంహణములకున్ను ఉపకారకత్వమే సమానమగును.

విద్యాస్థానమనగా విద్యయే. విద్యలు పదినాలుగు.

అంగాని వేదాశ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యేతాశ్చతుర్దశ

వేదాంగములు ఆరు. వేదములు నాలుగు. మీమాంస, తర్కము, పురాణము, ధర్మశాస్త్రము—నాలుగు అని. వేదముల కితర విద్యలను పరికరముగ చెప్పు ప్రకరణము కావున, పదినాలుగులో వేదములు నాలుగున్ను విడిచి, మిగిలిన పదింటిని పరికరమని చెప్పిరి. వేదాంగములు ఆరు యేవనగా—

శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః

శిక్ష— అని ఆరంభించి వేద పరికరముల స్వరూపమును వివరించుచున్నారు. ఈ అన్నిటిని భట్టరువారే శ్రీరంగరాజస్తవ ముత్తరశతకము 18-వ శ్లోకమందు "శిక్షాయాం వర్ణశిక్షా" అని సాయించిరి. ఈ శ్లోకమందు సంగ్రహముగ చెప్పబడిన ప్రత్యేకదాని స్వరూపమునకున్ను ఇచ్చట వివరణము చూడుడు.

తత్పరము కావున — అను హేతువాక్యము రాబోవు "ఇవి తత్వహిత పురుషార్థ ప్రతిపాదనయందు అప్రయోజకము లగును" అనుదానితో అన్వయించుచున్నది.

వర్ణ సామాన్యము —సామాన్యమనగా సామ్యము.

6. జ్యోతిషము— యథాశాస్త్రానుష్ఠేయములైన కర్మము లను యథాకాల మనుష్ఠించుటకు కాల విశేషప్రదర్శన ప్రధానము కావున;

7. న్యాయశాస్త్రము—ప్రమాణాది షోడశ పదార్థవ్యవహార మాత్ర ప్రతిష్ఠాపకము కావున;

8. మీమాంస— సోపబృంహణములైన వేదములయొక్క వచనవ్యక్తి విశేష నిర్ధారణార్థ యుక్తి విశేషప్రతిపాదకము కావున;

9. ఉపబృంహణములలో ధర్మశాస్త్రములు—కర్మభాగోప బృంహణప్రధానములు కావున;

10. బ్రహ్మభాగోపబృంహణ ప్రధానములైన ఇతిహాస పురాణములలో ఇతిహాసములు—ధర్మాది పురుషార్థ విశేష స్వరూప పూర్వకముగ ప్రవృత్తించుటచేత తత్వప్రతిపాదనమందు విలంబిత యములు కావున;

ఇవి తత్వ హిత పురుషార్థ ప్రతిపాదనమందు అప్రయోజకము లగును.

పురాణములు—పరతత్వ పరమహిత పరముపురుషార్థములలో సాక్షాదుపబృంహణములగును.

ఇతిహాస పురాణములు— ఇవి రెండున్ను కలిసి పదిగ లెక్కచేయవలసిన దైనది. ప్రత్యేకముగ లెక్క చేసిన, వేదపరికరములైన విద్యలు పదునొకటి యగును. "పురాణం ధర్మశాస్త్రంచ"అని శ్లోకమందే పురాణశబ్దముచే ఇతిహాస ముకూడ గ్రాహ్యము.

ఇతిహాసములు— బ్రహ్మభాగోపబృంహణములైన ఇతిహాసపురాణముల యందు ఇతిహాసమే శ్రేష్ఠమని సిద్ధాంతము. దీనిని శ్రీవచన భూషణ వ్యాఖ్యలో మణవాళమామునులు విస్తారముగ నిరూపించియున్నారు. ఇచ్చట కైశిక మాహాత్మ్యమునకు మూలమైన వరాహ పురాణమునకు శ్రైష్ఠ్యమును స్థాపించుట నుద్దేశము కావున, "ధర్మాది పురుషార్థ విశేష స్వరూప పూర్వకముగ ప్రవర్తించుటచే విలంబిత ప్రత్యయములు" అని ఇతిహాసములకు పురాణములకన్న కొరత చెప్పబడినది.

పురాణములలోను—

"సంకీర్ణాః సాత్త్వికాశ్చైవ రాజసాస్తామసా స్తథా"
అని కల్పవిశేషములను విభజించి,

యస్మిన్ కల్పే తు యత్ ప్రోక్తం పురాణం బ్రహ్మణా పురా
తస్య తస్య తు మాహాత్మ్యం తత్స్వరూపేణ వర్ణ్యతే

అగ్నేః శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్త్యతే
రాజసేషు చ మాహాత్మ్యమధికం బ్రహ్మణో విదుః
సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాం చ నిగద్యతే

సాత్త్వికేష్వథ కల్పేషు మాహాత్మ్యమధికం హరేః
తేష్వేవ యోగసంసిద్ధా గమిష్యన్తి పరాం గతిం

అని చెప్పిన ప్రకారముగ సాత్త్వికకల్పములలో సత్త్వోత్తరుడైన బ్రహ్మచేత ప్రోక్తములై,—

"మహాన్ ప్రభుర్వై పురుషః సత్త్వస్యైష ప్రవర్తకః"
అనిన రీతిగ సత్త్వప్రవర్తకుడైన పరమపురుషునికి ప్రతిపాదకములై,—

"సత్త్వాత్సంజాయతే జ్ఞానం"—అనియు

"సత్త్వం విష్ణుప్రకాశకం"—అనియు

చెప్పిన ప్రకారముగ అజ్ఞాన సంశయ విపర్యయములు తీరునట్లు పరతత్త్వాది విశేష నిశ్చాయకములైన సాత్త్విక పురాణములే ముముక్షువులకు ఉపజీవ్యములగును.

సాత్త్విక పురాణములలోను పరమ సత్త్వసమాశ్రయుడైన భగవంతుడు వక్తగ ప్రవృత్తమైన పురాణమే ఉత్కృష్ట మగును.

భగవద్వాక్యములలోను—

"కళ్ల వేడత్తై క్కొండుపోయ్ ప్పుఅంబుక్క వాఱుం కలంద
యుళ్ళం బేదంశెయ్ దిట్టుయిరుండ ఉపాయంగళుం" [శురరై

"త్రిణ్ణ్యప్పల్కాలసురర్కు త్తీంగిళైక్కుం తిరుమాల్"

అనినట్లు సర్వేశ్వరుడు అసురప్రకృతుల మోహనార్థముగ చెప్పు మాటలు సాత్వికులకు ఉపజీవ్యములు కావు.

మరియు, ఇతని యవస్థా విశేషములలో మాటలను చూచిన—

పరమపదనిలయుడు చెప్పుమాటలు పరుని వాక్యము కావున బంధములేనివారు వినదగినదిగ నుండును.

క్షీరాబ్ధినాథుని వాక్యములను చూచిన, సముద్రఘోషముతో కలిసి అర్థప్రత్యాయకముగ నుండవు.

పరమపదనిలయుడు— అని ఆరంభించి, "అనుమానించి తెలిసికొనవలసినదిగా నుండును—అను పదునొక వాక్యములచే సర్వేశ్వరుని వరాహావస్థ తప్ప ఇతర అవస్థ పదునొకటిలో గల వాక్యములలో దోషమును చూపించుచున్నారు. పరము, వ్యూహము, విభవము—అని మూడు అవస్థల నెత్తుకొని, పరమునకు పరమపదనిలయుని వాక్యములలోను, వ్యూహమునకు క్షీరాబ్ధినాథుని వాక్యములలోను, విభవములలో వరాహావతారము తప్ప, ఇతర అవతారపు వాక్యములలోను దోషము చెప్పబడినది. వరాహావతారపు శ్రైష్ఠ్యమును నిరూపించుటకొరకై భట్టరువారు భగవంతుని ఇతర అవస్థలయందు చమత్కారముగ దోషము నారోపించుచున్నారు. కావున, భగవద్వాక్యములయందు దోషము చూపించుట నుద్దేశ్యము కాదు. దోషముకూడ లేనందున, భగవద్వాక్యములలో చమత్కారముగగూడ దోషమును ప్రదర్శింపజాలక, భగవంతుని ఆయా అవస్థలోనుండు స్వభావమందు విరోధమున్నట్లు రసవంతమైన వాక్యరచనచే చూపించి, ఆ దోషమును భగవద్వాక్యములో నతిదేశించుచున్నారు.

పరుడు— అన్యుడు - అని సామాన్యార్థము. పరమపురుషుడని విశేషార్థము.

బంధము— సంబంధము - అని సామాన్యార్థము. అన్యుని వాక్యము కావున సంబంధము లేనివారిచే వినదగినదని సామాన్యముగ దోషము తోచును. పరమపదనిలయు డన్యుడగునా అని విరోధమును పరిహరించు క్రమము:—పరుని-పరమపురుషుని వాక్యము కావున బంధము లేనివారు ముక్తులు వినదగినది అని.

సముద్రఘోషముతో— క్షీరాబ్ధినాథుడు క్షీరాబ్ధి మధ్యనుండి చెప్పు మాటలు సముద్రఘోషముతో కలిసి శబ్దాధిక్యముచేత వర్ణాత్మకముగ నుండుట మారిపోయి ధ్వన్యాత్మకముగనే వినుటచేత అర్థబోధకముగ నుండదు.

మత్స్యరూపియొక్క వాక్యమును చూచిన, ఒకప్పుడుకూడ తీరము దాటనివాని వార్త కావున, జడాశయ సంబంధము తోచునట్లుండును.

కూర్మరూపియైనవాని మాటను చూచిన, గంభీరులు కదలునట్లు స్థిరులు భ్రమించునట్లున్ను, క్రీగతిని వొదలనివాడు చెప్పు మాటలు కావున, పైకొనుమాటగ నుండదు.

శ్రీ నృసింహుని వాక్యము, కంఠము మీదొకరూపు కంఠము క్రింద నొక రూపును కావున, ప్రదోషోదితముగ నుండును.

శ్రీ వామనుని వాక్యము క్రిందజెప్పిన ప్రకారముగాక, విషమ

---

తీరము దాటలేనివాడు—మత్స్యము తీరమునకు బయటవచ్చిన బ్రతుకనందున తీరము దాటలేనిదగును. స్వయం తరితు మక్షమః కిమసావ పరానపి తారయేత్ అనునట్లు, తాను తీరము దాటలేనివాడు తన వాక్యముచే ఇతరుల కుత్తారకుడగుట యెట్లు!

జడాశయ సంబంధము—జలాశయమను పాఠము పొరపాటు. జడాశయమని పఠించి, విరోధమును పరిహరించుటకుగాను జలాశయమని మార్చుకొనుము. చేతన జంతువైన మత్స్యము జడాయాశయము గలదను విరోధాభాసమును లడయోరభేదముచేత జలాశయ సంబంధమని మార్చి పరిహరించవలెను. తీరము దాటలేనివాడని ఒకదోషముతో నిలువక, జడాశయ సంబంధమని రెండవ దోషమును మత్స్యావతారమునకు చూపించుచున్నారు. జలాశయ సంబంధ మనగా—నీటిలో నుండుట.

గంభీరులు కదలునట్లు, స్థిరులు భ్రమించునట్లు— అను క్రియావిశేషణము క్రీగతిని వదలక నుండుట అను దానితో నన్వయించదు. "సంచరించుచు"—అని అర్థాత్ లభించు క్రియతో నన్వయించును. కూర్మము సంచరించునపుడు గంభీరముగను స్థిరముగ నుండు సముద్రమునకుగూడ క్షోభ భ్రమయున్ను కలుగును.

శ్రీ నృసింహ— వరాహావతారమును గూర్చి ఆఖరున చెప్పుటకుగాను కూర్మావతారానంతరము నృసింహావతారము నెత్తుకొనిరి.

ప్రదోషోదితము—నృసింహావతారము సాయంకాలము ప్రదోష సమయమున యేర్పడినది. అవతరించిన కాలముయొక్క దోషము నవతరించిన వారి మాటలలో చూపించుచున్నారు. ప్రదోషము ప్రకృష్టదోషము అని సాయాన్యార్థము.

క్రింద చెప్పినట్లు లేక—అనునది నృసింహావతారమునకు జెప్పిన కంఠ

పదముగ నుండును. ఇంతియేగాక, కవియైనవా డొకని విషయములో దృష్టిలోపము కలుగ జేయునట్లుండును.

పరశురాముని వాక్యము పరశుధాణముచేసి సర్వావస్థలలోను క్షమ వదలినవాని మాట కావున, ప్రత్యయము కలుగచేయునట్లుండును.

చక్రవర్తి తిరుమగళ్ వాక్యము కపులతో కలిసి పుణ్యాజన బాధా పర్యంతముగ నుండును.

---

మునకు పై క్రింద రెండుచోట్లలో నుండు దోషమువలె లేక, పదములో మాత్ర ముండు వైషమ్యమును చూపించును. వామనుని పదములో - మాటలో దోష మున్నదా అనిన, పదము—పాదము, అనగా కాలడుగు విషమముగా నుండినది. వి—సమము. అనగా, రెండడుగులుగా నుండవలసినది త్రివిక్రముడు కావున, మూడడుగులుగా నుండినదని దోషమును పరిహరించుకొనుడు.

కవియైన వాని విషయములో దృష్టిలోపము గలదను వాక్యముచే విద్వాంసులకు గూడ దృష్టిహాని కలుగచేయునని తోచు దోషమును కవియైన శుక్రాచార్యులకు వామనుడు నేత్రలోపమును కలుగచేసిన దానిని బట్టి పరిహరించుకొనుడు. శుక్రాచార్యులకు కవి అని పేరు. మహాబలి వామనునికి భూమి దానము చేయునపుడు విఘ్నము చేసిన శుక్రాచార్యులకు వామనుడు తన చేతి పవిత్రము చేత నేత్రలోపము చేసెననుట పురాణ ప్రసిద్ధము.

క్షమ వదలిన వాడు— క్షత్రియులయందు క్షమలేనివాడు పరశురాముడను నది సత్యము. ఇట్టి సత్యమైన దోషమునుకూడ పరిహరించు నుద్దేశముతో భట్టరువారు క్షమాశబ్దమును ప్రయోగించిరి. క్షమ వదలినవాడను దోషముగ తోచు నర్థము క్షమ - భూమిని వదలినవాడు - కశ్యప మహర్షికి దానము చేసిన వాడనుటచే గుణకథన మగుచున్నది.

పుణ్యాజన— అను సమస్త పదమునకు సంస్కృతమందు రాక్షసులని రూఢి, రామవాక్యము పుణ్యవంతులకు బాధక మని తోచు విరోధమును రాక్షసబాధా పర్యంతమని అర్థముచేసి పరిహరించవలెను. యాతుధాన: పుణ్యాజన: ఇత్యమర:

కపులతో కలిసి పుణ్యాజన బాధాపర్యంతముగనుండు ననగా-కపులతో కలిసినది ఒక దోషము, పుణ్యాజన బాధాపర్యంతముగనున్నది ఒక దోషము - అని రెండుగ విభజించవలెనా? లేక, కపులతో కలిసినందున పుణ్యాజన బాధాపర్యంత మగునని కపులతో కలిసినదానిని పుణ్యాజన బాధకు హేతువుగ చేయవలెనా - అని ఆలోచించవలయును. కపులతో కలిసిన దానినిగూడ విరోధాభాసమందు

బలభద్రుని వాక్యము సరఃస్రోతస్సుచేత వినతులగు వారిని గూడ ఉత్పథప్రవృత్తులుగ చేసినవానిమాట కావున, మద వికారము తోఁచియుండును. ఇంతియేగాక, శుద్ధ వర్ణుఁడుగా నున్నప్పటికి హలధరుఁడైనవాని మాట కావున, విశ్వసనీయముగ నుండదు.

---

దోషముగనే గ్రహించిన, విరోధమును పరిహరించునపుడు రాక్షస బాధకు కపులతో కలిసినదానిని హేతువుగ మార్చుకొనవలెనేగాని, ప్రత్యేక దోషముగ నుంచరాదు. అనగా - కపులతో కలిసి - కపుల సహాయమును నొంది, పుణ్యజన-రాక్షసబాధా పర్యంతముగ నుండునని విరోధ పరిహారములో అర్థము. విరోధాభాసమందు పుణ్యజన-సాధుజన బాధకముగ గపులతో కలిసిన దానిని ప్రత్యేక దోషముగ గ్రహించక, - హనుమంతుడు బాల్యమున తన చేష్టచేత ఋషులకు సహించలేని యుపద్రవముజేసి, "నీ బలము నీకు మరిచిపోవలెను" అని ఋషులు శపించిన వృత్తాంతమును బట్టి—కపులతో కలిసినది సాధుజన బాధాపర్యంతమని విరోధాభాసము చెప్పవచ్చును. హనుమంతుడు బాల్యమున ఋషుల కుపద్రవము జేసి, శాపము నొందిన వివరము కిష్కింధాకాండ ఆఖరున జాంబవంతునిచే జెప్పబడినది.

సరః స్రోతస్సుచే—స్రోతస్సునియే చాలును. సరః అనునది అధికము. సరిత్ అని యుండిన నుచితమగును. బలరాముడు యమునను నాగలిచే నీడిచి పై దెచ్చి నది ప్రవాహముతో వినతలగువారిని ఉత్పథప్రవృత్తులుగ జేసినదగును.

మదవికారము—బలరాముడు మధుపానముచే మత్తు గలవాడు. యమున నీడిచి పై దెచ్చిన ఉత్పథప్రవృత్తి మదవికారమును చూపించుచున్నది.

శుద్ధవర్ణుడు—ఈవాక్యము భట్టరువారి అరవ శ్రీసూక్తికి సరియైన తెనుగు కాదు. అరవమున ప్రయోగించిన శ్లేష తెనుగులో లేనందున కొంచెం మార్చబడినది. బలరాముని వన్నె తెలుపు. శుద్ధవర్ణుడు - ఉత్తమవర్ణుడైన బ్రాహ్మణుడుగనుండి హలధరుడుగ - నాగలినిధరించి యుండుట విరోధాభాసము. దానికి పరిహారము - శుద్ధవర్ణుడనగా బ్రాహ్మణుడని గ్రహించవలదు. బలరాముడు బ్రాహ్మణుడు కాడు. వాని రంగు మాత్రము తెలుపు. బ్రాహ్మణుడుగ లేనపుడు నాగలిని ధరించియుండుట విరోధము లేదని పరిహరించ వలయును.

ఇచ్చట పరశురాముడు క్షమ వదలినవాడు, చక్రవర్తి తిరుమగను (రాముడు) పుణ్యజన బాధకుడు, బలరాముడు మదవికారము గలవాడు - అని భట్టరువారు ముగ్గురు రాములకున్ను ప్రదర్శించిన దోషములనే వేదాంతదేశికులువారెత్తుకొని, రామమిశ్రులగు మణకాల్ నంబి ననుసంధించునపుడు మూడు విధ దోషముగల

శ్రీ కృష్ణుని వాక్యము బాల్యము మొదలు దొరికిన దొంగ తనమలయందు కానదగినట్లుండును.

కల్క్యవతార వాక్యము అనాగతమే గాని, ఒకరికిన్ని ఆగత మైన మాట కాదు. అదిగాక, అనుమానముచేతనే తెలియ వలసి నదిగ నుండును.

ఇట్లాక అన్యథాశంక చేయుటకు వీలులేక,

"ఎన త్తినురువాగి నిలమంగై యెళ్లిల్ కొండ

జ్ఞాన త్తి నొళియురు"— అనియు

"ఏనత్తురువాయిడంద జ్ఞానప్పిరాన్"— అనియు

చెప్పిన ప్రకారముగ సంయక్ జ్ఞానోపకారకుడు కావున,—

"పన్నియాయన్ను పారగంకిండ పాళియా నాళియానరుళే

నన్ను నానుయ్య"—

ముగ్గురు రాములువలెలేక, దోషరహితుడగు నాల్గవ రాముడు మణకాల్ నంబి - అని

అనుజ్ఝితక్షమాయోగ మపుణ్యజనబాధకం

అస్పృష్టమదరాగం తం రామం తుర్య ముపాస్మహే

అని పాయించిరి. "పరశురాముడు క్షమా యోగమును భూమిసంబంధమును వదలినవాడు; మణకాల్ నంబి క్షమను యోగాభ్యాసమును వదలనివారు.

రాముడు పుణ్యజన బాధకుడు— రాక్షస బాధకుడు; మణకాల్ నంబి పుణ్యజనులకు సాధువులకు అబాధకులు.

బలరాముడు మదరాగములచే స్పర్శింప బడినవాడు. మణకాల్ నంబి మద రాగములచే స్పర్శింప బడనివారు. అని రసవంతమైన అర్థముగల దేశిక శ్రీసూక్తికి భట్టరు వారి శ్రీసూక్తి ఆధారముగ నుండుట ఇచ్చట ననుభవింప దగినది.

ఇట్లాక— అని ఆరంభించి, ఈ పురాణ మన్ని పురాణములకన్న ఉత్కృష్ట మగునది — అను పర్యంతము వరాహావతారము పురాణము - వీటి గొప్పతనమును నిరూపించుచున్నారు.

సంయక్ జ్ఞానోపకారకుడు— అనునది పాశురమందుండు జ్ఞానప్పిరాన్ - అను పదముచే లభించిన అర్థము.

అని జ్ఞానవంతులు విశ్వసించి కైకొనదగిన కృపాతిశయముగలవాడు కావున,—

> "ఆది మున్నేనయాగియ అరనాయ మూర్తి యదు నమ్మై [యాళుమరశే"

అనిన రీతిగ రక్షకత్వ పూర్తిగలవాడు కావున,—

> "ఇరుంకర్పగం శేర్
> వానత్తవర్కు మల్లాదవర్కుం మత్తెల్లాయెవర్కుం
> జ్ఞానప్పిరానై యల్లాలిల్లై నాన్ కండ నల్లదు"

అని ఆళ్వార్లు ప్రథమ ప్రబంధములో నందరి కీతనిని తప్ప రక్షకాంతరము లేదని నిర్ణయించి, చరమప్రబంధ సమాప్తిలోను—

> "నీలవరై యిరండు పిఱై కవ్వి నిమిర్న్ద దొప్పక్
> కోలవరాహ మొన్రాయ్ నిలంకోట్టిడైక్కొండ వెందాయ్
> నీలక్కడల్ కడైందాయునై ప్పెత్తినిప్పోక్కువనో"

అని, అన్ని అవతారము లుండగ ఈ అవతారములో తాను అనంత మహానందము పొందిన ప్రకారమును ప్రతిపాదించినందున,

ఇతని రక్షకత్వము ఉత్తారకమైన రక్షకత్వము కావున,— ఇట్లితడు చేయు రక్షణము వాత్సల్య మూలమని తోచుటకు గాను

---

కృపాతిశయముగల దనునది పాశురమందుండు అరుళే అను పదమునుండి లభించినది.

రక్షకత్వ పూర్తిగలదనునది పాశురమందుండు అరనాయ,నమ్మైయాళుమరశే అను పదములవలన లభించిన అర్థము.

ఉత్తారకమైన రక్షకత్వ మనునది నిలంకోట్టిడైక్కొండ వెందాయ్ అను దానిచేత లభించినది. ప్రళయమున మునిగిపోయిన భూమిదేవిని వరాహస్వామి పైకెత్తి రక్షించుటచే వారి రక్షకత్వముత్తారకమైన రక్షకత్వమనుచున్నది.

ఇంద అవతారత్తై త్తాంపణ్ణి అందమిల్ పేరిన్బంపెత్తపడియై అని అన్ని పుస్తకములలోనుండు పాఠము సరికాదు. అప్పంగారి పుస్తకములోనుండు పాఠమే సరికావున; అదే ఇచ్చట చేర్చబడినది.

"ఏనమాయ్ నిలంకీండ ఎన్నప్పనే"— అనియు

"అప్పనూఱ్ని యిడన్దెయఱ్ఱు కొణ్డాన్"— అనియు

అని వాత్సల్యావినాభూతమైన పితృత్వమితనికి గలదని చెప్పి నందునను,— (వరాహావతారమే సర్వోత్కృష్టమగును.)

సకలలోక పిత యగు నితనిని సకలలోకమాతయగు భూమి దేవి ప్రజలకు హితమేదని ప్రశ్నింపగ ప్రవృత్తమైన పురాణము కావున, ఈ పురాణమే సకల పురాణములకన్న ఉత్కృష్టమగును.

ఇది సర్వేశ్వరుడు దేవిని చూచి చెప్పుమాట కావున,

"పాంబణైయార్క్కుం తంపాంబుపోల్ నావు మిరండుళవాయ్ త్తు"

---

వాత్సల్యావినాభూతమైన పితృత్వమనునది పాశురములోనుండు "ఎన్నప్పనే" అను దానిచేత లభించిన అర్థము.

చెప్పినందునను—అనిన అనంతరం "వరాహావతారమే సర్వోత్కృష్టమగును" అని కలిపిన సుగమమగును. ఇతర అవతారములకు దోషమును ప్రదర్శించి, "ఇట్లొక అన్యథా శంక చేయుటకు వీలులేక"—అని ఆరంభమయిన వాక్యము వరాహావతారముయొక్క గొప్పతనమును నిరూపించుటయందే ఉద్దేశ్యముగలది కావున, దాని ననుసరించియే ఇచ్చట ప్రదర్శించినట్లు వాక్యమును కలుపుకొనుడు.

సకలలోకపితయగు—అని ఆరంభించి "ఉత్కృష్టమగుట కడ్డు లేదు"— అని పర్యంతముండు వాక్యము వరాహపురాణమునకుండు వక్తృ వైలక్షణ్యమునున్ను శ్రోతృవైలక్షణ్యమునున్ను చూపించి వరాహపురాణమే సర్వోత్కృష్ట మగునని స్థాపించుచున్నది. ఈ వక్తృ శ్రోతృవైలక్షణ్యమును వేదాంతదేశికులువారు రహస్యశిఖామణియందు విస్తారముగ సాయించియున్నారు. దానిని అనుబంధములో చూడుడు.

ఇది సర్వేశ్వరుడు—ఈ పురాణము ఈ కైశికాధ్యాయము ద్వారా బోధించు గానరూపమైన ఉపాయ విశేషమునే ఆండాళ్ అనుసరించినదని నిరూపించి, ఆమూలముగను వరాహావతారముయొక్క శ్రైష్ఠ్యమును చెప్పుటకుగాను - ఆండాళ్ పెరుమాళ్లను అసత్యవంతుడని నిందించినదాని భావమును వెల్లడిచేయుచున్నారు- "ఇది సర్వేశ్వరు"డని ఆరంభించి "నాచ్చియారే స్వయముగ చెప్పినది" - అనువరకు.

ఇది - ఈ వరాహపురాణము.

దేవిని చూచి—భూమిదేవిని చూచి.

అనిన రీతిగ ఇదిగూడ ఉపాలంభవిషయమగునో అనిన,-ఆమాటకూడ

"శెమ్మైయుడైయ తిరువరంగర్ తాం పణిత్త
మెయ్మ్మై ప్పెరువార్తై విష్ణుచిత్తర్ కేట్టిరుప్పర్"

అని తెలిసియున్నప్పటికి, విశ్లేషక్లేశమును సహించలేని త్వరాతిశయముచేత "పాంబణైయార్క్కుం తంపాంబుపోల్ నావుమిరండుళవాయ్త్తు"—అని అనంత భుజగ సంసర్గదోషముచేత అసత్యమగునో అని అతిశంక చేసినదగును.

ఈ మాట అట్లులేక, "పార్వణ్ణమడమంగై పత్తర్" అనిన రీతిగ దేవియందుగల భావబంధముచేత ప్రళయార్ణవ మగ్నయైన

ఇదిగూడ—వరాహపురాణముగూడ.

ఉపాలంభ విషయము— నిందా విషయము.

ఆ మాటకూడ—పాంబణైయార్క్కుం—అను మాటకూడ.

ఇది సర్వేశ్వరుడని ఆరంభించిన వాక్యమునకు తాత్పర్య మేమనగా—వరాహస్వామి సాయించిన పురాణము తన భార్యకు చెప్పినది కావున, తాత్కాలికముగ ఆమెకు తృప్తి కలుగచేయుటకుగాను యేర్పడినదై పరమార్థమైనదిగ లేకుండవచ్చునో - అను శంక అందరికే సహజమగును. అదేలనగా— తనయందు వచ్చెదనని చెప్పిన పెరుమాళ్ రానందున "పాంబణై యార్క్కుం తంపాంబుపోల్ నావుమిరండుళవాయ్త్తు" పన్నగశయనము గల వారికి తన పామునకువలె నాలిక రెండయినది అని ఆండాళే చెప్పియున్నది. కావున,— వరాహస్వామి చెప్పిన ఈ పురాణము పరమార్థ మగునా అనిన,— పెరుమాళ్ నిర్దిష్టకాలములో రానందున వారి విశ్లేషక్లేశమును సహించక త్వరాతిశయముచేత నాలిక రెండయినదో అని ఆండాళ్ అతిశంక చేసినదే గాని, అది నిజమైన నిందకాదు. భగవద్వాక్యములన్ని సత్యమని ఆండాళే ఎరుగును. "తిరువరంగర్ తాంపణిత్త మెయ్మైప్పెరువార్తై" రంగడు చెప్పిన నిజమైన గొప్పమాటలు—అని ఆండాళే స్థలాంతరమున చెప్పియున్నది. కావున, భార్యకు చెప్పిన నిమిత్తమున వరాహపురాణము పరమార్థము కాదని శంకించవలదు.

ఈ మాట అట్లులేక - ఈ వరాహపురాణము ఉపాలంభ విషయముగ లేక.

ఈ మాట—తాత్కాలిక ప్రీతికొరకై చెప్పు ప్రణయకాలము లేక, సముద్రమందు మునిగిపోయిన భూమిదేవిని అందుండెత్తి ఉద్ధరించి, సంసారార్ణవ మగ్న

ఈమె నందుండి పైకెత్తి, ఈమె క్లేశమును తీర్చి పెట్టినప్పటికి, సంసారార్ణవమగ్నులైన తన ప్రజల దుఃఖనివృత్తికొరకు సుకరోపాయము తెలియక విషణ్ణయైయుండు నీమెను చూచిన భగవంతుడు ఆమె యూరడించునట్లు చెప్పిన మాట కావున అతిశంక చేయవలదు.

కావున, అవస్థాంతరమువలె లేకుండ వరాహావస్థలో తనకు చెప్పిన మాట తప్పరనుసర్థమును

"పాశితూర్తుక్కిడంద పార్మగళుక్కప్పండొరునాళ్
మాశుడంబిల్ నీర్వారా మానమిలాప్పన్రియాం
తేశుడైయ దేవర్ తిరువరంగచ్చెల్వనార్
పేశియిరుప్పనగళ్ పేర్కవుం పేరావే."

అని నాచ్చియారే చెప్పిరి.

కావున నీపురాణ మన్ని పురాణములకన్న నుత్కృష్టమగుట కడ్డులేదు. ఎట్లనగా—

ఈ పురాణమందు భగవంతుడు చెప్పిన ఉపాయములన్నిటిలోను గానరూపమైన ఉపాయమే అత్యంతోత్కృష్టమగును. వీరు పలు ఉపాయములను చెప్పుటను వినిన నాచ్చియార్ ఉపాయములన్నియున్నప్పటికి, ఈ గానరూపమైన ఉపాయమునే స్వయమవలంభించి,

పార్కడలుళ్ పైయత్తుయిన్ర పరమనడి పాడి— అనియు
ఓంగియులగళంద ఉత్తమన్ పేర్ పాడి— అనియు
మామలర్గళ్ తూవిత్తొழுదు వాయినాల్ పాడి— అనియు

---

లైన తన ప్రజల హితము నడుగు ప్రళయకాలమని ప్రదర్శించి, పెరుమాళ్ చెప్పిన మాట పరమార్థమని నిరూపించుచున్నారు - "ఈ మాట" అను మొదలు "అతిశంక చేయవలదు"ను పర్యంతముగ.

ఉపాయము లన్నిటిలోను—అన్ని ఉపాయము లెవి అని వేదాంత దేశికులు వారు రహస్యశిఖామణియందు సాయించి యున్నారు. రహస్యశిఖామణి అను బంధమున చేర్చబడి యున్నది.

నారాయణన్ మూర్తి కేశవనై ప్పాడవుం నీ— అనియు
పావాయెఱ్ఱందిరాయ్ పాడిప్పఱై కొండు— అనియు
నిన్ ముట్టుంపుగుందు ముగిల్వణ్ణన్ పేర్ పాడ— అనియు
మనత్తుక్కినియానై ప్పాడవుం నీ— అనియు
కిళ్ళిక్కళైందానై క్కీర్తిమై పాడి— అనియు
పంగయక్కణ్ణానై ప్పాడేలోర్— అనియు
మాత్తారై మాత్తళిక్కవల్లారై ప్పాడేలోర్— అనియు
తూయోమాయ్ వందోం తుయిలెళప్పాడువాన్— అనియు
తిరుత్తక్కశెల్వముం శేవకముం యాం పాడి— అనియు
గోవిందావున్దన్నై ప్పాడిప్పఱై కొండు— అనియు

వీరు చెప్పినపుడు వినిన అన్ని ఉపాయములలోను ఈమె మనస్సుకు ఇష్టమై, తాను పాడిన పాటలో అనుష్ఠించి చూపించిన ఉపాయము ఇదియే అగును. కావున, పలు ప్రదేశములలోను తాను పాడిన పాటలను జెప్పి "పాడగల నాచ్చియార్" అని పేరుపొందుటచేతను, ఈ గీతరూపమైనఉపాయమే ముఖ్యమగును—అని నాచ్చియారునుజూచి చెప్పిరి.

---

నాచ్చియార్ల ప్రబంధములు తిరుప్పావై నాచ్చియార్ తిరుమొళ్ళి అని రెండు. వీటిలో తిరుప్పావనుండి మాత్రమే గానవిషయమైన శ్రీసూక్తులు పదుమూడును చూపించుచున్నారు. నాచ్చియార్ తిరుమొళ్ళిలో గానవిషయమైన శ్రీసూక్తులు లేవా? ఏల తిరుప్పావ నుండియే శ్రీసూక్తులను చూపించుచున్నారనిన, నాచ్చియార్ తిరుమొళ్ళి మొత్తము 143 పాశురములకు "కుళిరరువి వేంకడత్తెన్ గోవిందన్ గుణం పాడి" అని ఒకటే గానవిషయమైన కంఠోక్తి కనబడుచున్నది. తిరుప్పావ శ్రీసూక్తులు పదుమూడున్ను పాశురక్రమములోనే ప్రదర్శింపబడియున్నవి.

పాడగల నాచ్చియార్-అని ఆండాళుకు పేరు భట్టరువారికి పూర్వమే ఏర్పడినట్లు చూపించుచున్నది "పేరు నొందినందున" అను భట్టరువారి శ్రీ సూ_

నాచ్చియారును—భూమిదేవిని.

చెప్పిరి—వరాహస్వామి.

## వ్యాఖ్యానము

శ్రీవరాహ ఉవాచ.—

జాగరే తు విశాలాక్షి జానతో వాప్యజానతః।
యో మే ప్రగాయతే గేయం మమ భక్త్యా వ్యవస్థితః॥ (1)

ఈ శ్లోకమందు తమ గాయకుని గానప్రకారమును చెప్పుచున్నారు.

గానముచేయగలవాడొకడు జాగరవ్రతనిష్ఠుడై "బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ"—అనిన రీతిగ బ్రాహ్మమైన ముహూర్తమున వచ్చి—నేను 'ముఖమిచ్చి' విన్నప్పటికి, జగద్రక్షణ చింతలో అన్యపరుడైనప్పటికి, మన గుణాపదానములను లోన పెట్టి రచించిన గాధలను ఒక ఫలమునుకూడ తలంపక మనయందు భక్త్యతిశయముతో మనకొరకే గానము చేయగలడని నాచ్చియారును చూచి చెప్పుచున్నారు.

యావన్తి త్వక్షరాణ్యస్య గీయమానే యశస్విని ।
తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే॥ (2)

ఇట్లు నీ కీర్తిని నాకీర్తిని లోనపెట్టి రచించిన గాధలను మనకు గానము చేసినయెడల, ఆ గాధలయందుండు అక్షరములకు, స్వరము

---

భట్టరువారీ మాహాత్మ్యమున నొక పదమును కూడ వీడక వ్యాఖ్యానించుచున్నారు; కొన్ని చోట్ల తమ అభిప్రాయమును కూడ కలుపుచున్నారు. అరవమున వాచకశైలిగనే వ్యాఖ్యానించినందున మూలమందుండు ప్రత్యేక పదమునకున్న రసవంతముగ అర్థము సాయించుటను గమనింపుడు. భాషాంతరీకరణమునకున్న తాత్పర్యార్థము వ్రాయుటకున్న భట్టరువారి వ్యాఖ్యానమే మార్గదర్శిగనున్నది.

1. ఈ శ్లోకమందు-అను వాక్యముచేత నీ మొదటి శ్లోకము గానప్రకారమును విధించునట్లు ఏర్పడినది. కావున, ప్రగాయతే అను క్రియను విధిపరముగ చేసి,—"హే, విశాలాక్షి! యస్తు (గానకుశలః) సః జాగరే స్థితః, మమ భక్త్యా వ్యవస్థితశ్చ జానతో వాప్యజానతో మే గేయం ప్రగాయేత్" - అని అన్వయించుకొనవలెను. పరస్మైపది ఆత్మనేపదిగ ప్రగాయతే అని ప్రయోగింప బడియున్నది.

బ్రాహ్మే ముహూర్తే - ఇత్యాదిచే గానముచేయవలసిన కాలమును చూపించుచున్నారు.

చేత వృద్ధియగు నొక్కొక్క అక్షరమునకున్ను వేనవేలు సంవత్సరములు స్వర్గలోకమందుండును నంపాడువాన్ (మనగాయకుడు) అనిరి.

రూపవాన్ గుణవాన్ శుద్ధః సర్వధర్మభృతాం వరః।
నిత్యం పశ్యతి వై శక్రం వజ్రహస్తం న సంశయః॥ (3)

అతడు స్వర్గలోకమందున్నంతవరకు అచ్చటివారందరిలోను సుందరాకృతిమంతుడై, గుణవంతుడై, స్వర్గసుఖమునందుసక్తుడుగాక, సర్వధర్మములను తెలిసుకొని అచ్చట మమ్ములను మరవకయుండి 'ఇతడు' ఆ దేశమున కధిపతియైన ఇంద్రుడు తన ఆయుధముతోవచ్చి సేవించి నిలువగ, అపాంగ వీక్షణము చేయుచుండును నంపాడువాన్ - అని చెప్పిరి.

మద్భక్తశ్చాపి జాయేత ఇంద్రదేవైకపదే స్థితః।
సర్వధర్మగుణశ్రేష్ఠస్తత్రాపి మమ లుబ్ధకః॥ (4)

ఇట్లింద్రుడు సేవించుచున్నప్పటికి, ఇంద్రునివలె నచ్చట మమ్ములను మరచి యుండలేక, మనకారాధనములైన కర్మములను చేసి మమ్ములనే అనుసంధానము చేయుచుండును నంపాడువాన్— అని చెప్పిరి.

ఇంద్రలోకాత్ పరిభ్రష్టో మమ గేయపరాయణః।
ప్రముక్తః సర్వసంసారైర్మమ లోకం చ గచ్ఛతి॥ (5)

ఇంద్రలోకములో నున్నంతవరకు అచ్చటివారందరిని పిలిచి

---

2. నంపాడువాన్—ఆఖరున నుండు "మమ గాయకః" అనుదానికి ఇది సరియైన అరవము. చండాళునికి భట్టరువారిట్లు పేరు బెట్టినట్లు చెప్పరాదు. "నంపాడువానుని ఇంటిలో విడచి రా" అని నంబెరుమాళ్ అరయర్ల కరుళిపాటు సాయించునట్లు, "మమ గాయకః" అని వరాహస్వామి తన గాయకుని చెప్పిన మాటకే నంపాడువానని భట్టరువారి అరవము. భట్టరువారు ప్రతిశ్లోకమున చండాళుడను శబ్దమును విడచి, నంపాడువాననియే ప్రయోగించినందున, ఇది యతనికి భట్టరు వారిచ్చిన పేరుగనే వ్యవహరింప బడుచున్నది.

గానము వినిపించుటయేగాక, అచ్చటను మనలనే తలచి గానము చేయుచున్నందున, అచ్చటనుండి ఇతనిని మన మహామందిరమున "ఏతత్ సామ గాయన్నాస్తే" అని ఎల్లప్పుడును మనకొరకై గానము చేయునట్లు చేసితిమి—అనిరి.

ఏవంతు వచనం శ్రుత్వా తత్ప్రసాదాద్వసుంధరా।
వరాహరూపిణం దేవం ప్రత్యువాచ శుభాననా॥ (6)

ఇట్లు శ్రీవరాహనాయనార్ చెప్పినది విని హృదయములో కలిగిన సంతోషమంతయు ముఖమున తెలియునట్లు వికసించిన ముఖముగల భూమిదేవి వరాహస్వామిని చూచి ఒక మాట విన్నపించినది.

అహో గీతప్రభావో వై యస్త్వయా పరికీర్తితః।
కశ్చ గీతప్రభావేణ సిద్ధిం ప్రాప్తో మహాతపాః॥ (7)

వేదములు, ఋషులు చెప్పిన మాటగ లేకుండ ఇది తామే చెప్పిన మాటగనున్నది. ఇటువంటి గీతప్రభావముచే తమ చరణారవిందములను నొందినవా డెవడో అతనిని తెలుపవలెను - అని విన్నవించినది.

శ్రీవరాహ ఉవాచ—

ఇట్లు విన్నవించిన భూమిదేవిని చూచి వరాహస్వామి చెప్పుచున్నారు:

శృణు తత్వేన తే దేవి కథ్యమానం యశస్విని।
యస్తు గీతప్రభావేణ సిద్ధిం ప్రాప్తో మహాతపాః॥ (8)

6. వరాహనాయనార్—పిళ్లై, మొదలి, ఉడయార్, నాయనార్, పిరాణ్ ఆచ్చాణ్—అని ఉత్తమమైన అర్థముగల పేరులే మన ఆచార్యులకుండినవి. ఇవి ఇపుడు బ్రాహ్మణులచే వదలబడి ఇతరులకయి, ఒక్కొక్క సమూహమును చెప్పునట్లు మారిపోయినవి. నాయనార్ అను పదము వరాహావతారము తప్ప, ఇతర అవతారములకు ప్రయోగింప బడినట్లు తెలియలేదు.

''పాంబణై యార్కుం తంపాంబుపోల్ నావుమిరండుళవాయ్ త్తు పన్నగశాయియైన వానికి తన పన్నగమువలె రెండు నాలుకలు యేర్పడి యున్నవని నీవు నన్ను చెప్పినట్లు నీతో నేను రసించి చెప్పుమాటగ దీనిని అనుకోనవలదు. ఇది సత్యమైన మాట అగును. ఎవడు మమ్ము లను గురించి పాడి పరమపదమునొందెనో అతనిని చెప్పెదను, వినుము అని చెప్పుచున్నారు.

అస్తి దక్షిణదిగ్భాగే మహేంద్రో నామ పర్వతః ।
తత్ర క్షీరనదీ పుణ్యా దక్షిణే సాగరంగమా ॥ (9)

దక్షిణదిక్కున మహేంద్రమని యొక ప్రసిద్ధమైన పర్వతమున్నది. అచ్చట క్షీరనదియనునది దక్షిణ సముద్రగామినిగ నున్నది.

తత్ర సిద్ధాశ్రమే భద్రే చండాలః కృతనిశ్చయః ।
దూరాజ్జాగరణే గాతి మమ భక్త్యా వ్యవస్థితః॥ (10)

పూర్వము నీవును నేనును చిన్నగుడిశగా కట్టియుండిన ఆశ్రమ మందు, పాపయోనిలో పుట్టిన వాడొకడు మనకై గానమ చేయ వలెనని సంకల్పించి, జాగరవ్రతనిష్ఠుడై, 'మరియు' మనయందు భక్తితో బ్రాహ్మ ముహూర్తమునవచ్చి, తన జాత్యనుగుణముగ దూరముననుండి గానము చేసెను – అని చెప్పిరి.

---

9. దక్షిణ సముద్రగామిని—అనునది తాత్పర్యార్థము. తిరుక్కురుంగుడి యందు పారుచుండు క్షీరనది కులశేఖర పట్టమునకు దక్షిణముగ సముద్రములో సంగతమగుచున్నది. ఇది తూర్పు సముద్రమైనప్పటికి, ధనుష్కోటికి దక్షిణమందు న్నది దక్షిణ సముద్రమనియే వ్యవహారము.

10. పూర్వము నీవును నేనును చిన్న గుడిశగ కట్టి—అని ఆ ఊరికి తిరుక్కు రుంగుడి అనుపేరు ఏర్పడిన కారణమును తెలుపుచున్నారు. పెరుమాళ్ నాచ్చియార్ల చ్చట కురుంగుడి-చిన్నగుడిశ కట్టి వాసముచేసిన వృత్తాంతము ఆ ఊరి మాహాత్మ్య ములోను, పురాణములలోను వెదక దగినది. కురుంగుడి అనుదానిని కురంగపురి అని మార్చి, ఆ ఊరికి ''శ్రీమత్ పోతకురంగ నామనగరే'' అనియొక శ్లోకము కూడ ఏర్పడిన వివరమాలోచింప దగినది.

ఏవంతు గాయమానస్య గతాః సంవత్సరా దశ।
శ్వపాకస్య గుణజ్ఞస్య మద్భక్తస్య వసుంధరే॥ (11)

ఇట్లంత్య జాతియందు పుట్టినప్పటికి, మన గుణము ననుసంధానము చేసి, మనకు భక్తుడుగ వచ్చి, ఇట్లు పది సంవత్సరములుగానము చేసెను—అని చెప్పిరి.

కౌముదస్యతు మాసస్య ద్వాదశ్యాం శుక్లపక్షకే।
సుప్తే జనే గతే యామే వీణామాదాయ నిర్యయౌ॥ (12)

పిమ్మట నొక కార్తిక మాసమందు శుక్లపక్షద్వాదశి రాత్రి ఒక యామమునకుపై నందరు నిద్రించినపుడు, తాను జాగరవ్రత నిష్ఠుడు కావున, మేలుకొనియుండి మనముండుచోటు వచ్చి, మనకై గావించుటకుగాను వీణ నెత్తుకొని తన ఇంటినుండి బయలుదేరెను—అని చెప్పిరి.

తతో వర్త్మని చండాలో గృహీతో బ్రహ్మరక్షసా।
అల్పప్రాణః శ్వపాకో వై బలవాన్ బ్రహ్మరాక్షసః॥ (13)

అనంతరము మార్గమధ్యమున వచ్చునపుడు ఒక బ్రహ్మరక్షస్సు చేతిలో చిక్కినాడు. ఆ బ్రహ్మరాక్షసుడు తిండి మక్కుటమై ఒడలు బలసినవాడై బలవంతుడుగ నుండెను. నంపాడువాన్ ధ్యానించి, గ్లాని నొంది, మనసు కరిగి, కలగినవాడు కావున దుర్బలుడై యుండెను.

దుఃఖేన స తు సంతప్తో నచ శక్తో విచేష్టితుం।
ఉవాచ వచనం మందం మాతంగో బ్రహ్మరాక్షసం॥ (14)

నంపాడువాన్ బలవంతుడు కానందున పరాక్రమించి తన్ను విడిపించుకొని వెళ్లుటకు సమర్థుడు లేడు. బ్రాహ్మణజాతి కానందున ఒక పనసయు చెప్పి విడిపించుకొనుటకు సమర్థుడు కాడు. మనయందు

13. ఊన్ మల్గుమోడు పరత్తవన్—అనునది తిరువాయ్ మొళ్లి 3-వ పత్తు, 7-వ పాశురము.

14. ఒక పనస—వేదము యాబై యాబై వాక్యములుగ విభజింపబడి

భరన్యాసమే చేసి, బ్రహ్మరక్షస్సుని చూచి మధురముగ నొక మాట చెప్పెను – అనిరి.

గచ్ఛామి సన్తోషయితు మహం జాగరణే హరిం।
గానేన పుండరీకాక్షం బ్రహ్మారాక్షస ముంచ మాం॥ (15)

"శిత్తం శిరుకాలే వందున్నైచ్చేవిత్తు" ప్రొద్దుననే వచ్చి నిన్ను సేవించి—అనినప్రకారముగ సర్వేశ్వరుని పాడి ఆనందింప బోవువాడుగనుండు నన్ను విడువు మనెను – అని చెప్పిరి.

ఏవముక్తః శ్వపాకేన బలవాన్ బ్రహ్మరాక్షసః।
అమర్షవశమాపన్నో నచ కించిత్తమబ్రవీత్॥ (16)

ఇట్లు నంపాడువాన్ చెప్పిన మాట విని బ్రహ్మరక్షస్సు అతి క్రూరమై మాటకూడ చెప్పక నుదాసించి యుండినది – అనిరి.

ఆత్మానం ప్రతి ధావన్తం చండాళః ప్రాహ రాక్షసం।
కిం త్వయా చేష్టితవ్యం మే య ఏవం పరిధావసి॥ (17)

ఇట్లు కోపాక్రాంతుడై పై పడుటకు పరుగెత్తి వచ్చు బ్రహ్మరక్షస్సుని చూచి, మరల నంపాడువా నొక మాట చెప్పెను. "నీవు ఇట్లు నామీద పరుగెత్తివచ్చి చేయతలచిన దేమి" అని అడిగెను–అనిరి.

శ్వపాకవచనం శ్రుత్వా తతో వై బ్రహ్మరాక్షసః।
ఉవాచవచనం ఘోరం మానుషాహారలోలుపః॥ (18)

బ్రహ్మరక్షస్సు నంపాడువాన్ చెప్పిన మాట విని, తనకుండు

---

యున్నది. ప్రత్యేక భాగమునకున్ను ఒక పంచాశత్ అని పేరు. పంచాశత్ అను దానికి ప్రాకృతము పనస.

పనస చెప్పి విడిపించు కొనుట. ఎట్లనగా—పిశాచములు వేదఘోషము వినగనే భయపడి పోవును. బ్రహ్మరక్షస్సు వేదఘోషమునకు భయపడక తాను కూడ వేదము చెప్పునని కర్ణపరంపర. పనసచెప్పి బ్రహ్మరక్షస్సును సంతోష పరచి విడిపించుకొన వచ్చునను భావముచేత భట్టరువారిట్లు సాయించిరి కాబోలు!

16. అతిక్రూరముగ—అనునది అమర్షవశమాపన్నః అను దానికి అర్థము.

ఆకలిచే మానుషమాంసమం దాశగలదై ఇతనిని చూచి క్రూర మగు వార్త చెప్పినది - అనిరి.

అద్య మే దశరాత్రం వై నిరాహారస్య గచ్ఛతః।
ధాత్రా త్వం విహితో మహ్యమాహారః పరితో మమ॥ (19)

"నిగరిలవర్ పుగழ்పాడి యిళైప్పిలం"— సమములేనివాని కీర్తిని గానముచేసి గ్లానిలేని వారము—అనినరీతిగ పదిసంవత్సరములు నీవు పాడి శ్రమలేక తిరుగుచుందువు. నేను పదిరోజులైనవి భోజనము చేసి; ఆకలిచే నేను చిక్కిపోయి తిరుగుచున్నాను. కావున, నాకు దైవము ఆహారముగ కల్పించిన నిన్ను నేను విడుతునా - అనినది బ్రహ్మరక్షస్సు - అని చెప్పిరి.

అద్య త్వాం భక్షయిష్యామి సవసా మాంసశోణితం।
తర్పయిత్వా యథాన్యాయం యాస్యామిచ యథేప్సితం॥ (20)

ఇప్పుడు నేను నిన్ను విడవను. నీ యవయవములను ప్రత్యేకముగ కోసి, నీ శరీరముననుండు రుధిరమాంసాదులచే దేవతారాధనము చేసి, నా ఆకలిని కూడ తీర్చుకొని నా యిష్టప్రకారము వెళ్లుదును అని చెప్పినదనిరి.

బ్రహ్మరక్షోవచః శ్రుత్వా శ్వపాకో గీతలాలసః।
రాక్షసం ఛందయామాస మమ భక్త్యా వ్యవస్థితః॥ (21)

ఇట్లు బ్రహ్మరక్షస్సు చెప్పినమాట విని నంపాడువాన్ శరీరహాని పర్యంతమైన ఆపద వచ్చినప్పటికి, మనయందు భక్త్యతిశయముచే వ్యవస్థితుడై మనకు గానము చేయవలెనను ఆశచేత ఆ రక్షస్సు ననువర్తించి మంచిగ నొక మాట చెప్పెను - అనిరి.

---

19. పరితో మమ— అనుదానికి వ్యాఖ్యానములేదు. దానికి సరియైన అర్థము కూడ ఏర్పడదు. ఇతర పుస్తకములయందు "కల్పితో మమ" అని యుండుట కూడ "విహితోమహ్యం" అనినచేత వ్యర్థమగుచున్నది.

శ్రుణు తత్త్వం మహాభాగ భక్ష్యోఽహం సముపాగతః।
ఆవశ్య మేతత్ కర్తవ్యం ధాత్రా దత్తం యథా తవ॥ (22)

ఓ మహాభాగుడా ! నేను యథార్థము చెప్పుచున్నాను. నీవు వినుము. నీవు చెప్పినట్లే నీకు నేను భక్ష్యముగ నగుచున్నాను. బ్రహ్మ కల్పించినట్లు చేయవలసినది నాకుగూడ అవశ్యమే యనెను నంపాడువాళ్ - అనిచెప్పిరి.

పశ్చాత్త్వాదసి మాం రక్షో జాగరే వినివర్తితే।
విష్ణోః సన్తోషణార్థాయ మమైతద్వ్రతముత్తమం॥ (23)

ఓ బ్రహ్మరాక్షసుడా ! నాకొక నియమము గలదు. సర్వేశ్వరుని ప్రీత్యర్థముగ జాగరవ్రతమని ఒక వ్రతము గలదు. దానిని పూర్తి చేసి నేను మరల వత్తును. అపుడు నీవు నన్ను భక్ష్యముగ చేసుకొనవచ్చునని నెను నంపాడువాళ్ - అనిరి.

21. నీవు చెప్పినట్లు నీకు నేను భక్ష్యముగ నగుదుననునది "భక్ష్యోహం సముపాగతః" అను దానికి అర్థము. బ్రహ్మ కల్పించినట్లు చేయవలసినది నాకు గూడ అవశ్యమే అనునది "అవశ్యమేతత్" అను నుత్తరార్ధమునకు వ్యాఖ్యానము. "ధాత్రా త్వం విహితో మహ్యమాహారః" అను 19-వ శ్లోకపు ఉత్తరార్ధమునకీ ఉత్తరార్థము అనువాదముకావున, యథా తవ ధాత్రా దత్తం - భోజనం, తథైవ తదవశ్యం మమాపి కర్తవ్యం-బ్రహ్మ కల్పించినట్లు చేయవలసినది నాకుకూడ అవశ్యమే-అని శ్లోకమునున్ను వ్యాఖ్యానమునున్ను అన్వయించుకొనవచ్చును. అనువాదము లేక దృష్టాంతమయిన యెడల, "యథా తవ ధాత్రా దత్తం - భోజనం తథా ఏతద్-వక్ష్యమాణంవ్రతం మమాప్యవశ్యం కర్తవ్యం, బ్రహ్మ కల్పించినట్లు-నీకు ఆహారముగ కల్పించినట్లు, నాకు కల్పించిన వ్రతము నాకుకూడ - అవశ్యమే." అని గూడ అన్వయించుకొనవచ్చును.

22. దానిని పూర్తిచేసి - అనగా జాగరణమును - మేలుకొనియుండుటను భూర్తిజేసి అని అర్థమగుచున్నది. నిద్రలేకయుండుటను భూర్తిజేయుట అనిన అర్థము కాదు. ఇతనికి గానము వ్రతమా ? జాగరణము వ్రతమా ? ప్రారంభములోనే జాగరవ్రతనిష్ఠుడై పాడవలెను - అని వ్యాఖ్యానింపబడినందున రెండున్ను వ్రతమగుచున్నది. వీటిలో నంగాంగిభావము నాలోచించిన, గానము ప్రధానమై, దానికి జాగరణమంగముగ దోచుచున్నది. ఇచ్చట, గానమును బూర్తిజేసి మరల నేను వచ్చెదనని జెప్పక, "జాగరే వినివృత్తే తు-జాగరమును నివర్తించి వచ్చెదను "

రక్ష మాం వ్రతభంగాద్వై దేవం నారాయణం ప్రతి।
జాగరే వినివృత్తేతు మాం భక్షయ యథేప్సితం॥ (24)

భగవంతుని గురించి నేను ఆరోపించుకొనిన వ్రతమునకు భంగము రాకుండ నీవు నన్ను రక్షించవలెను. ఈ జాగర వ్రతము సమాప్తము కాగానే నీ మనస్సుకు 'సరిపోయిన' ప్రకారము నన్ను భక్ష్యముగ చేసుకొనవచ్చునని నంపాడువాన్ - అనిరి.

శ్వపాకస్య వచః శ్రుత్వా బ్రహ్మరక్షః క్షుధార్దితం।
ఉవాచ మధురం వాక్యం శ్వపాకం తదనంతరం॥ (25)

ఇట్లు నంపాడువాన్ చెప్పిన మాట విని ఆకలిచే చిక్కియున్న బ్రహ్మరక్షస్సు మధురముగ నొక మాట చెప్పినది - అనిరి.

మోఘం భాషసి చండాళ పునరేష్యామ్యహం త్వితి।
కో హి రక్షో ముఖాద్భ్రష్టస్తన్ముఖాయాభివర్తతే॥ (26)

ఓ చండాళుడా! నీ జన్మమునకు సరిగ ఉన్నది నీవు చెప్పిన

---

అని మూలమున్ను వ్యాఖ్యానమున్ను, ఒకే విధముగనున్నవి. ఈ శ్లోకమునకు ప్రక్కని శ్లోకమందుండు "జాగరే వినివర్తితే, జాగరే వినివృత్తేతు" అను దానిని భట్టరువారే 31-వ శ్లోకమున "దూరాజ్జాగరణం కృత్వా అను దానిని వ్యాఖ్యానించునపుడు వ్యక్తము జేయుచున్నారు. అచ్చట లేపి అని వ్యాఖ్యానింప బడియున్నందున, ఇచ్చటనుండు జాగర జాగరణ - అను పదములకు మేలుకొని యుండుట అని అర్థము కాదు. లేపుట అనియే అర్థమగుచున్నది. జాగరణమనగా ప్రబోధనము. జాగరవ్రతమనగా భగవంతుని లేపుట. దీనిచేత జాగరవ్రతమే ముఖ్యమై గానము అంగమగుచున్నది.

23. నేను ఆరోపించుకొనిన - అనునది భట్టరువారిచే చేర్చబడినది. భట్టరు వారి అరవమును సంస్కృతమున వ్రాసిన—"దేవం నారాయణం ప్రతి మదను ష్ఠీయమానవ్రత భంగాన్మాం రక్ష" అని ఏకదేశాన్వయముగనే వచ్చును. దేవం నారాయణం ప్రతి-దేవం నారాయణముద్దిశ్య, మాం వ్రతభంగాద్రక్ష - భగవంతునికొరకై వ్రతమునకు భంగము రాక నీవు నన్ను రక్షించవలయును - అని సుగమముగ నన్వయించిన, వ్రతము నారాయణునికొరకై అనుదానిని విడచి, రక్షణమును నారాయణునికొరకై చేయుము అని ఏర్పడును.

మాట. పోయి మరల వత్తునని నీవు సరియైన అసత్యమే చెప్పితివి. ఎవడైన బ్రహ్మరక్షస్సు చేతిలో చిక్కి, తప్పించుకొని పోయి, మరల వచ్చి దానిచేతిలో దొరుకునా అని చెప్పినదనిరి.

బహవః సన్తి పంథానో దేశాశ్చ బహవస్తథా।
ఆత్మదేశం పరిత్యజ్య పరేషాం గన్తుమిచ్ఛసి॥ (27)

ఈ మార్గము తప్ప పలు మార్గములు గలవు. ఈ దేశము గాక పలు దేశములు గలవు. నీవు స్వదేశమును విడచి దేశాంతరము వెళ్ల తలంచుచున్నావని చెప్పినది – అనిరి.

స్వశరీర వినాశాయ నచాగచ్ఛతి కశ్చన।
రక్షసో ముఖవిభ్రష్టః పునరాగన్తుమిచ్ఛసి? (87)

తనకు శరీరనాశము కలుగు స్థానము తెలిసియున్నప్పటికి ఆ స్థానము నుద్దేశించి యెవరైన వత్తురా! రక్షస్సుని చేతిలో చిక్కి తప్పిపోయి మరల వత్తునని సరియైన అసత్యమే చెప్పితివి.

రాక్షసస్య వచః శ్రుత్వా చండాలో ధర్మసంశ్రితం।
ఉవాచ మధురం వాక్యం రాక్షసం పిశితాశనం॥ (29)

ఇట్లు ఈ రాక్షసుడు చెప్పిన మాట విని, నంపాడువాఁ ఈ రక్షస్సుని చూచి ధర్మసంయుక్తముగను మధురముగను ఒకమాట చెప్పెననిరి.

యద్యప్యహం హి చండాలః పూర్వకర్మవిదూషితః।
ప్రాప్తోఽహం మానుషం భావం విదితేనాన్తరాత్మనా॥ (30)

పూర్మకర్మదోషముచేత నేను చండాలజన్మమందు పుట్టినప్పటికి, పరమాత్మ జ్ఞానముండుటచేత నొక మనుష్యునికి గల జ్ఞానము నాకు గలదు. కావున, నా మాట వినుమనెను – అని చెప్పిరి.

---

25. సరియైన అసత్యమే–అని మోఘశబ్దమును వ్యాఖ్యానించిరి.

శ్రుణు తత్సమయం రక్షో యేనాగచ్ఛామ్యహం పునః।
దూరాజ్జాగరణం కృత్వా లోకనాథస్య తృప్తయే॥ (31)

త్రైలోక్యనాథుడైన సర్వేశ్వరుని నిద్రనుండి లేపి సమాప్త వ్రతుడై మరల నేను ఎట్లు వత్తునో, దానికి సరియైన ప్రతిజ్ఞ చేసెదను. దానిని వినుమనెను నంపాడువాన్ – అని చెప్పిరి.

సత్యమూలం జగత్ సర్వం లోకః సత్యే ప్రతిష్ఠితః।
నాహం మిథ్యా ప్రవక్ష్యామి సత్యమేవ వదామ్యహం॥ (32)

లోకము పుట్టినది సత్యముచేతనే. లోకము ప్రతిష్ఠితమై నిలచినదికూడ సత్యముచేతనే. కావున, నేను సత్యమునే చెప్పెదను గాని అసత్యము నొకప్పుడును చెప్ప ననెను – అనిరి.

అద్య మే సమయ స్తత్ర బ్రహ్మరాక్షస తం శృణు।
శపామి సత్యేన గతో యద్యహం నాగమే పునః॥ (33)

ఓ బ్రహ్మరాక్షసుడా! నాప్రతిజ్ఞను వినుము. ఎవడు సర్వ కారణమైన సత్యమును తప్పునో, అతని పాపములో నేను చేరగలను, మరల రానియెడల – అనెను.

---

31. భగవంతుని లేపి – నేడు ఉత్థానద్వాదశి కావున సర్వేశ్వరుని ప్రభోధనము చేయు కైంకర్యమున నీడుపడుచున్నాడు నంపాడువాన్.

దూరాత్ – తన జాతికనుగుణముగ దూరముననేయుండి – అని పూర్వమే వ్యాఖ్యాతము.

ఎట్లు – అని వాక్యముండు రీతిలోనే-“యేన-యథాహం పునరాగచ్ఛామి తత్సమయం – తాదృశం సమయం కరిష్యామి, తం శ్రుణు.” – అని అన్వయించుకొనవలెను.

33. ఎవడు సత్యము తప్పునో అతని పాపమును నేను నొందుదును – అని ‘శపామి సత్యేన గతః’ అను దానిని వ్యాఖ్యానించిరి. సత్యేన గతః యః, తస్య పాపం లభేయ – అని సత్యమును సప్తమ్యంతముగ చేసుకొనిరి.

యో గచ్ఛేత్ పరదారాంశ్చ కామమోహ ప్రపీడితః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (34)

ఎవడు మన్మథపీడితుడై పరస్త్రీ గమనము చేయునో, అతని పాపము నొందుదును, మరల రానియెడల - అనెను.

పాకభేదంతు యః కుర్యాదాత్మనశ్చోపభుంజతః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (35)

ఎవడు భోజనము చేయునపుడు తనకున్ను తోడ భుజించు వారికిన్ని పాకభేదము చేసి భుజించునో, అతని పాపమును చెందుదును, మరల రానియెడల - అనెను.

దత్వా వై భూమిదానంతు పునరాచ్ఛిందతీహ యః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (36)

ఎవడు ఒక బ్రాహ్మణునికి భూమి దానముచేసి, మరల ఆ భూమిని అపహరించునో, అతని పాపమును నొందుదును, మరల రానియెడల - అనెను.

స్త్రియం భుక్త్వా రూపవతీం పునర్యస్తాం వినిన్దతి।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (37)

ఎవడు రూపవతియైన స్త్రీని యౌవనకాలమం దనుభవించి, పిమ్మట నామెకు దోషమును కల్పించి పరిత్యజించునో, అతని పాపమును నొందుదును, మరల రానియెడల - అనెను.

యోఽమావాస్యాం విశాలాక్షి శ్రాద్ధం కృత్వా స్త్రియం
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ [వ్రజేత్।

ఎవడు అమావాస్యనాడు శ్రాద్ధము చేసి స్త్రీసంగమము చేయునో, అతని పాపము నొందుదును, మరల రానియెడల అనెను.

---

34. తస్య పాపేన అను సుత్తరార్ధమున అహం అను దానిని లిప్యేయం అను దానితో కలిపి, ఆగమే యది న - అని అన్వయించి, నష్టుడ అసతి అని అర్థము చెప్పవలయును.

భుక్త్వా పరస్యచాన్నాని య_స్తం నిన్దతి నిర్ఘృణః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (39)

ఎవడు పరుని అన్నమును చక్కగ భుజించి నిర్దయుడై మరల అతనిని దూషించునో, అతని పాపము నొందుదును, మరల రానియెడల – అనెను.

యస్తు కన్యాం దదామీతి పునస్తాం న ప్రయచ్ఛతి।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (40)

ఎవడు కన్య నిచ్చెదనని వాగ్దానముచేసి ఇయ్యకుండునో అతని పాపము నొందుదును, మరల రానియెడల–అనెను.

షష్ఠ్యష్టమ్యోరమావాస్యా చతుర్దశ్యోశ్చ నిత్యశః।
అస్నాతానాం గతిం గచ్ఛే యద్యహం నాగమే పునః॥ (41)

ఎవడు షష్ఠీ, అష్టమీ, అమావాస్య, చతుర్దశి ఈ తిథుల యందు స్నానముచేయక భుజించునో, అతని పాపమును నేను పొందుదును, మరల రానియెడల – అనెను.

దాస్యామీతి ప్రతిశ్రుత్య నచ య_స్తత్ప్రయచ్ఛతి।
గతిం తస్య ప్రపద్యే వై యద్యహం నాగమే పునః॥ (42)

ఎవడు ఒకనికి ఒక వస్తువును ఇచ్చెదనని చెప్పి, మరల దాని నియ్యక పోవునో, అతని పాపమును నేను చెందుదును, మరల రాని యెడల – అనెను.

మిత్రభార్యాం తు యో గచ్ఛేత్ కామబాణవశానుగః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (43)

మితాత్ త్రాయత ఇతి మిత్రం—అనినట్లు మహోపకారకు

---

41. నిత్యశః – అనుదానిని భుజించునో అను వ్యాఖ్యానానుగుణముగ భుంజతాం అని దిద్దుకోవలెను.

డైన మిత్రునిభార్య నెవడు వశీకరించునో, అతని పాపమును నేను పొందుదును, మరల రానియెడల – అనెను.

గురుపత్నీం రాజపత్నీం యే తు గచ్ఛంతి మోహితాః।
తేషాం గతిం ప్రపద్యే వై యద్యహం నాగమే పునః॥ (44)

ఎవరు తమకు ఆముష్మికప్రదాతయగు ఆచార్యుని పత్నిని ఐహికప్రదాతయగు రాజుపత్నిని కామముచేత ననుభవింతురో, వారి పాపమును నేను అనుభవించెదను, మరల రానియెడల – అనెను.

యోవై దారద్వయం కృత్వా ఏకస్యాం ప్రీతిమాన్ భవేత్।
గతిం తస్య ప్రపద్యే వై యద్యహం నాగమే పునః॥ (45)

ఎవడు రెండు స్త్రీలను వివాహించి, ఒకర్తె నుపేక్షించి మరియొక్కతెను సన్తోషముతో ననుభవించునో, అతని పాపము నొందెదను, మరల రానియెడల – అనెను.

అనన్యశరణాం భార్యాం యౌవనే యః పరిత్యజేత్।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (46)

ఎవడు అనన్య గతియై, పతివ్రతయై యుండు స్త్రీని యౌవనమున త్యజించునో, అతని పాపము నొందుదను, మరల రాని యెడల–అనెను.

గోకులస్య తృషార్తస్య జలార్థమభిధావతః।
విఘ్నమాచరతే యస్తు తత్ పాపం స్యాదనాగమే॥ (47)

ఎవడు బహుదాహముచే అధికపీడితమై జలపాననిమిత్తము వేగముగ పరుగెత్తి వచ్చు గోకులమునకు జలపాన విఘ్నము చేయునో, అతని పాపము నొందుదును, మరల రానియెడల – అనెను.

బ్రహ్మఘ్నేచ సురాపేచ చోరే భగ్నవ్రతే తథా।
యా గతిర్విహితా సద్భిస్తత్ పాపం స్యాదనాగమే॥ (48)

ఎవడు బ్రహ్మహత్య చేయునో, యెవడు మద్యపానము చేయునో, యెవడు స్వర్ణ స్తేయముచేయునో, యెవడు వ్రతభంగము చేయునో–

ఇటువంటి మహా పతితులకు పెద్దలచే ఎట్టి గతి చెప్పబడినదో, అట్టి క్రూరమైన పాపమును నేను అనుభవింతును, మరల రానియెడల- అనెను.

వాసుదేవం పరిత్యజ్య యేన్యం దేవముపాసతే।
తేషాం గతిం ప్రపద్యే వై యద్యహం నాగమే పునః॥ (49)

ఎవరు ఆశ్రిత సులభుడై, సర్వవ్యాపియై యుండు శ్రీవాసుదేవుని ఆరాధించక ఇతర దేవతల నుపాసింతురో, వారి దుర్గతిని నేను నొందెదను, మరల రానియెడల - అనెను.

నారాయణ మథాన్యైస్తు దేవైస్తుల్యం కరోతి యః।
తస్య పాపేన లిప్యేయం యద్యహం నాగమే పునః॥ (50)

సర్వస్మాత్ పరుడై, సర్వాన్తర్యామియై, సర్వకర్మ సమారాధ్యుడై, ముముక్షూపాస్యుడై, మోక్షప్రదుడై యుండు సర్వేశ్వరుని "కాణిలుమురుప్పిలార్, శెవిక్కినాద కీర్త్తియార్, పేణిలుం వరం తరుం మిడుక్కిలాద దేవరాయ్"—చూచుటకు రూపులేక, చెవికిరసముగనుండు కీర్త్తిలేక, భజించినప్పటికి వరమిచ్చు పౌరుషములేనివారై, కర్మపరవశులై యుండు వ్యతిరిక్త దేవతలను సమముగ యెవడు యెంచునో, అతనివలె నిత్యసంసారియగుదును, మరల రానియెడల - అని ఇట్లు శపథముల జేసెను నంపాడువాన్ - అని వరాహ నాయనార్ భూమిదేవికి చెప్పిరి.

చండాలవచనం శ్రుత్వా పరితుష్టస్తు రాక్షసః।
ఉవాచ మధురం వాక్యం గచ్ఛ శీఘ్రం నమోస్తుతే॥ (51)

ఇట్లు ప్రతిజ్ఞ చేసిన నంపాడువానును చూచి బ్రహ్మరక్షస్సు సంతుష్టుడై నమస్కరించి,-"ఇట్లు ప్రతిజ్ఞ చేసిన నీవు త్వరగ వెళ్లి వ్రత

51. సంతుష్టుడై నమస్కరించి - దేవతాంతరోపాసనయు దేవతాంతర సామ్యబుద్ధియు లేని శుద్ధజ్ఞానముగల వానికి నమస్కరించునట్టి వైష్ణవత్వము గలది ఈ బ్రహ్మరక్షస్సుకూడ. కావుననే, శపథములన్నిటిని లక్ష్యముచేయక, ఈ శపథమును వినిన తత్క్షణమే ఇది నంపాడువానుని విడచినది.

మును పూర్తిచేసి మరల రాగలవు'' - అని మధురముగ చెప్పెను.

రాక్షసేన వినిర్ముక్తశ్చండాళః కృతనిశ్చయః।
పునర్గాయతి మహ్యం వై మమ భక్త్యా వ్యవస్థితః॥ (52)

రాక్షసునిచే విడువబడిన నంపాడువాన్ సంసారమునుండి ముక్తుడైనవాడు వచ్చునట్లువచ్చి పూర్వమువలె మనకు గానము చేసెననిరి.

అథ ప్రభాతే విమలే వినివృత్తేతు జాగరే।
నమో నారాయణేత్యుక్త్వా శ్వపాకః పునరాగమత్॥ (53)

అనంతరం ప్రాతఃకాలమున జాగరవ్రతమును బూర్తిచేయగనే, మనయందు ఆత్మసమర్పణము చేసి, తనకు త్యాజ్యమైన శరీరము పోవడములో నుండు నాశచేత నంపాడువాన్ తిరిగి వచ్చె ననిరి.

గచ్ఛతస్త్వరితం తస్య పురుషః పురతః స్థితః।
ఉవాచ మధురం వాక్యం శ్వపాకం తదనంతరం॥ (54)

నంపాడువాన్ తిరిగి పోవునపుడు మనయందు గానము చేయుటకు వచ్చిన వేగమునకంటే రెండింతలు వేగముతో బయలుదేరెను. ఇట్లు పోవుచుండు వానియెదుట ఒక పురుషుడు వచ్చి, నంపాడువానుని చూచి మధురముగ ఒక మాట ఆడెను.

కుతో గచ్ఛసి చండాళ ద్రుతం గమననిశ్చితం।
ఏతదాచక్ష్వ తత్త్వేన యత్ర తే వర్తతే మనః॥ (55)

నీ నడకను చూచిన పూర్వమువలె లేకుండు మహావేగ

---

52. పూర్వమువలె మనకు పాడెను—పునర్గాయతి మహ్యం వై. పది సంవత్సరములు పాడినట్లు ఈ సంవత్సరముకూడ వచ్చి పాడెను.

53. ఆత్మ సమర్పణము చేసి— అనునది నమోనారాయణేత్యుక్త్వా అను దానికి అర్థము.

54. రెండింతలు వేగముతో అనునది త్వరిత శబ్దార్థము.

55. ద్రుతం గమన నిశ్చితం—గమనేన నిశ్చితం లే ద్రుతం.

ముగ నున్నది. ఇట్లు నీవు యెక్కడ పోవుదువు? దీనిని నాకు సత్యముగ చెప్పవలెనని అడిగె నా పురుషుడు.

తస్య తద్వచనం శ్రుత్వా శ్వపాకః సత్యసమ్మతః।
ఉవాచ మధురం వాక్యం పురుషం తదనంతరం॥ (56)

సత్యప్రతిజ్ఞుడైన నంపాడువాన్ ఆ పురుషుని మాట విని అతనిని చూచి మధురముగ ఒక మాట చెప్పెననిరి.

సమయో మే కృతో యత్ర బ్రహ్మరాక్షససన్నిధౌ।
తత్రాహం గన్తుమిచ్ఛామి యత్రాసౌ బ్రహ్మరాక్షసః॥ (57)

బ్రహ్మరక్షస్సున కెదుట శపథములను చేసితిని. ఆ ప్రతిజ్ఞ తప్పక, బ్రహ్మరక్షస్సు యెక్కడనుండునో అక్కడ పోవుచున్నాను. వాడు పూర్వముండినచోట్ల లేనియెడల, వాడుండుచోటును వెతగి వెళ్లువాడను – అని చెప్పెను నంపాడువా ననిరి.

శ్వపాకవచనం శ్రుత్వా పురుషో భావశోధకః।
ఉవాచ మధురం వాక్యం శ్వపాకం తదనన్తరం॥ (58)

ఇట్టు నంపాడువాన్ చెప్పిన మాట విని ఆ పురుషుడు ఇతని మనస్సును శోధించుటకొరకై మధురముగ నొకమాట చెప్పె ననిరి.

న తత్ర గచ్ఛ చండాల మార్గేణానేన సువ్రత।
తత్రాసౌ రాక్షసః పాపః పిశితాశీ దురాసదః॥ (59)

అచ్చట జాత్యా రాక్షసుడై, అందులో విభీషణునివలె ధార్మికుడు కాక పాపిష్ఠుడై, అందులో శరీరముతో బ్రతుకుటకు లేకుండ మాంసభక్షకుడై, వానిని చంపి పోవుటకు వీలులేక బలవంతుడై

---

57. మునుపు ఉండిన చోట్ల చూడనియెడల వాడుండు చోటును వెతగి— యత్రాసౌ బ్రహ్మరాక్షసః.

59. రాక్షసః, పాపః, పిశితాశీ, దురాసదః—అను నాలుగ పదములకు భాషాంతరీకరణముగను వ్యాఖ్యానముగను జాత్యా రాక్షసుడై ఇత్యాది యుండు రస మనుభవిం పదగినది.

యుండు నొకడు. నీవు అచ్చట పోకూడదని నంపాడువానుని చూచి ఇతని మనస్సుని శోధించుటకు చెప్పెను ఆ పురుషుడు.

పురుషస్య వచః శ్రుత్వా శ్వపాకః సత్యసంగరః।
మరణం తత్ర నిశ్చిత్య మధురం వాక్య మబ్రవీత్॥ (60)

ఆ పురుషుడు చెప్పిన మాట విని సత్యవాదియగు నంపాడువార్ సత్యమును విడచుటకన్న ప్రాణమును విడచుటయే శ్రేష్ఠమని తలచి మధురముగ నొక మాట చెప్పె ననిరి.

నాహమేవం కరిష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి।
అహం సత్యే ప్రవృత్తో వై శీలం సత్యే ప్రతిష్ఠితం॥ (61)

ఓ పురుషుడా! నేనది చేయను. నేను సత్యము తప్పనివాడను. నేను సత్యము తప్పినప్పటికి నా స్వభావము సత్యము తప్పదనెను నంపాడువార్.

తతః స పద్మపత్రాక్షః శ్వపాకం ప్రత్యువాచ వా।
యద్యేవం నిశ్చయస్తాత స్వస్తి తేఽస్తు గమిష్యతః॥ (62)

ఇట్లు చెప్పిన నంపాడువానుని చూచి ఆ పురుషుడు ఇతడు ప్రాణమును విడచియైన సత్యమును రక్షించగలవాడనని చెప్పినందున ప్రీతిచేత "అమలంగళాగ విళిక్కుం" నిర్మలముగ చూచు—అనినట్లు నంపాడువానుని పాడవచ్చునట్లు చేసిన బ్రహ్మరక్షస్సుని ఆపదనున్ను, నంపాడువానుయొక్క ఆపదనున్ను తీరునట్లు పూర్ణకటాక్షము చేసి "నీకు మంగళము కలుగుగాక; నీవు వెళ్లుము" అని చెప్పెను. ఆ పురుషుడు మెవడోఅని సందేహించవలదు. "మహా వరాహః స్ఫుటపద్మలోచనః" అని, "పురుషః పుష్కరేక్షణః" అనియు చెప్పినట్లు ఇద్దరున్ను ఒక్కరే అని తెలిసికొనుము.

---

62. పాడవచ్చునట్లు చూపించిన... భగవత్సన్నిధియందు పాడవచ్చునట్లు చూపించిన. లేక, అచ్చట పాడి తనసమీపము వచ్చునట్లు చూపించిన.

బ్రహ్మరక్షోఽంతికం ప్రాప్య సత్యేసౌ కృతనిశ్చయః।
ఉవాచ మధురం వాక్యం రాక్షసం పిశితాశనం॥ (63)

ఆ పురుషుడు సెలవిచ్చినమీాద నంపాడువాన్ బ్రహ్మరక్షస్సుండు చోటును వెదికిపోయి, రక్షస్సును సమీాపించి మధురముగ నొకమాట చెప్పెను.

భవతా సమనుజ్ఞాతో గానం కృత్వా యథేప్సయా।
విష్ణవే లోకనాథాయ మమ పూర్ణో మనోరథః। (64)
ఏతాని మమ చాంగాని భక్షయస్వ యథేచ్ఛయా॥ (64½)

ఓ బ్రహ్మరాక్షసుడా! నీ యాజ్ఞ చేయగ వెళ్లిన నేను బ్రాహ్మణానుజ్ఞ నొంది పోయినవాడను కావున, నాకు కావలసినట్లు సర్వేశ్వరుడై మహా విష్ణువై యుండు శ్రీసుందర పరిపూర్ణుని పాడి ఆనందింపించి పూర్ణ మనోరథుడ నైతిని. నీవున్ను నా శరీరమందు గల రుధిరమంసాదులచేత పూర్ణ మనోరథుడు కాగలవు.

శ్వపాకవచనం శ్రుత్వా బ్రహ్మరక్షో భయానకం।
ఉవాచ మధురం వాక్యం శ్వపాకం సంశితవ్రతం॥ (65½)

అత్యంతం భయంకరమైన బ్రహ్మరక్షస్సు నంపాడువానుని మాట విని, నంపాడువానుని చూచి మధురముగ నొకమాట చెప్పినది.

త్వమద్య రాత్రౌ చండాల విష్ణోర్జాగరణం ప్రతి।
ఫలం గీతస్య మే దేహి జీవితం యదిచేచ్ఛసి॥ (66½)

ఓ మహానుభావుడా! ప్రాణమును వీడ వచ్చిన నీకు ప్రాణముతో పోవలసియుండినయెడల, సర్వేశ్వరునికి పాడిన గానముయొక్క ఫలము నిచ్చి నీవు ప్రాణముతో వెళ్లుము.

బ్రహ్మరక్షోవచః శ్రుత్వా శ్వపాకః పునరబ్రవీత్॥ (67)

ఇట్టి బ్రహ్మరక్షస్సుని మాట విని నంపాడువాన్ ఆక్షేపించి ఒక మాట చెప్పెను.

